# ఫ్రాన్స్ పతనం



కామ్రేడ్ తుమ్మల



సంస్కృతి గ్రంథమండలి
మద్రాసు.

# ఇందులో



పుట






PRINTED AT THE B. N. K. PRESS,
43, ACHARAPPAN ST. G.T MADRAS.

# గ్రంథకర్త

---

పుట్టుక 1887. విద్యాభ్యాసం ఇంగ్లండు, స్విట్జర్లాండు, జర్మనీ, స్పెయిన్ దేశాల్లో. 1909 లో న్యాయవాదిగా జీవితాన్ని ఆరంభించాడు. పార్లమెంటులో శ్రామికుల తరఫున సభ్యుడు. సోవియట్ సంయుక్తరాష్ట్రంతో మైత్రికై ఇంగ్లండులో ఏర్పడిన సంస్కృతిసంబంధాల సంఘానికి అధ్యక్షుడు. 1933 సెప్టెంబరులో లండనునగరంలో జరిగిన 'రెయిక్ స్టాగ్ 'దహనవిచారణలుకుఅధ్యక్షుడుగూడాను. 1938 లో రష్యా వెళ్లొచ్చాడు. 1936 లో మాస్కో విచారణలప్పుడు అక్కడనుండి తన అనుభవాన్ని చిన్న పుస్తకంగా — 'జినొవైవ్ విచారణ' — ప్రచురించాడు. కుటుంబజీవి. ఒక కొడుకు, ఒక్క కూతురు ఉన్నారు. ఈతని యితర రచనలు 'మాస్కోపై వెలుతురు', 'ఈ యుద్ధం వ్యాపించాలె?', 'ఫెడరల్ అపోహ', 'సోవియట్ సంయుక్త రాష్ట్రం — మన మిత్రుడు'.

---

మాతృకఆంగ్లంలో 'The Fall of the French Republic' అన్న పేర లండనులో 1941 లో ప్రచురింపబడింది. వెల రు. 4-6-0.

# ఫ్రాన్స్ పతనం

రచన:

డి. యస్. ప్రిట్, కె. సి., యం. పి.,

అనూత్తి:

కామ్రేడ్ తుమ్మల

ప్రచురణ:

సంస్కృతి గ్రంథమండలి

వంగల్ బిల్డింగ్స్, పెరంబూరు పోస్టు,

మద్రాసు.

ప్రచురణ—2

వెల ఎనిమిదణాలు

ప్రథమ ముద్రణం:

ఏప్రిల్ 1942

సంపాదకులు:

కస్తూరి సూర్యప్రకాశరావు,

కొత్తపల్లి సుబ్బరామయ్య, ఎం. ఏ., ఎల్.టి.,

# మా మాట.

---

సంస్కృతిగ్రంథమండలి కార్యక్రమాన్ని 1941 లో ప్రారంభించాం. కాని కొన్ని కారణాలవల్ల మా ప్రథమప్రచురణ 1942 ఫిబ్రవరిలో గాని వెలువడిందిగాదు. మా ప్రథమ ప్రచురణ వెలువడి యింకా రెండు నెల్లయినా పూర్తిగాకముందే రెండో ప్రచురణకు పూనుకున్నామంటే యిది సాహసమనే అనాలి. మా ప్రథమప్రచురణలో యింకా 400 కాపీలైనా అమ్ముడుబోలేదు. అప్పుడే మరో పుస్తకాన్ని ముద్రింపిస్తున్నామంటే నిజంలో కొన్ని సాధకబాధకాల నెదుర్కొంటున్నాముగూడను. మిత్రులు పల్వురు మా గ్రంథప్రచురణలలో, గ్రంథవిక్రయంలో సాయపడ్డారు. వారందరికి కృతజ్ఞులం. పాఠకమహాశయు లనేకులు పుస్తకాల వి. పి. పి. ద్వారా పంపమని వ్రాశారు. రు. 0-8-0 వెలగల పుస్తకానికి, పైగా రు. 0-6-0 వారిచేత ఖర్చు పెట్టించడం మాకిష్టంలేదు. మా ఏజంట్లు వద్దగాని, హిగిన్ బాథమ్స్ రైల్వే పుస్తకవిక్రయశాలలలోగాని కొనుక్కొన్న లాభదాయకం. పల్లీయులైన పాఠకులు నలుగురు కలిసి వి. పి. పి. ద్వారా తెప్పించుకుంటే చౌకగా గిట్టుంది.

'ఫ్రెంచి ప్రజాస్వామ్యపతనం' అన్న పేరుతో ఆంగ్లేయభాషలో డి. యన్. ప్రిట్ గారొక ఉద్గ్రంథాన్ని వ్రాశారు. దాని అనుసరణే యీ గ్రంథం—'ఫ్రాన్సుపతనం'. ఫ్రాన్సు 1940 జూన్ 22 న హిట్లరుకు లొంగిపోయింది. నాజీరాక్షసత్వాన్నుండి బయటపడి బ్రతికిన విజ్ఞులు కొందరు ఇంగ్లండుచేరి తమ అనుభవాలను గ్రంథరూపంగా ప్రచురించారు.

తానుస్వయంగా ఫ్రాన్సుపతనమప్పుడు అచ్చటలేకున్నా విషయపరిజ్ఞానాన్ని పూర్తిగాకల్గియుండడంచేత ప్రిట్ గొప్ప గ్రంథాన్ని వ్రాశారు. ఈగ్రంథాన్ని యింతత్వరలో అనుసరించివ్రాసి, అనయాచితంగా, ఉచితంగా మా గ్రంథ మండలికొసంగిన మిత్రులు కామ్రేడ్ తుమ్మలవారికి కృతజ్ఞులం.

జపాను మనదేశాన్ని నేడో, రేపో కబళింపనున్నదని భయపడే యీ రోజుల్లో ఫ్రాన్సు జర్మనుదౌష్ట్యాన్ని యేయే కారణాలచేత ఎదుర్కోలేకపోయిందని తెలుసుకోడం మనకెంతో అవసరం. జర్మనుదండయాత్రను ఇంగ్లండు ఎలా ప్రతిఘటించగల్గిందని తెలిసికోడంకన్నా ఫ్రాన్సు ఎలా ప్రతిఘటింపలేకపోయిందని తెలిసికోడం మనకు ప్రస్తుతపరిస్థితులలో గొప్ప ఉపకారికాగలదు. అందుచేతనే యీ గ్రంథాన్ని వెంటనే ప్రకటిస్తున్నాం. ఆంధ్రపాఠకలోకం మాకిచ్చే ఉత్సాహాన్నిబట్టే మా గ్రంథమండలి ముందుకు సాగుతుంటుంది. సంస్కర్తలైన ప్రతిఒక్కరు మాకు సాయపడ్తారని ఆశిస్తున్నాం.

ఏప్రిల్ 1, 1942<br>పెరంబూరు.

సంపాదకులు.

# 1. మూడవ రిపబ్లికు

## ఫ్రెంచి సామ్రాజ్యవాదం బలపడుట.

1940 జూన్ మాసములో ఫ్రాన్సు విచ్ఛిన్న మయింది. అతిస్వల్పకాలంలో ఫ్రాన్సు నాజీల హస్తగతం గాడానికిగల కారణాలను యింతవరకూ ఎవ్వరూ సరిగా విశదీకరించలేదు. పతనమొందిన ఫ్రాన్సును గురించి తర్జనభర్జనలు చేసేదానికంటె ఆపేరెత్తకుండా వుంటేనే మనశ్శాంతిగా యుంటుందనే వాంఛ ప్రబలిపోయింది.

కాని ఫ్రాన్సును గురించి ఆలోచించడం, గత జలసేతు బంధనంవంటిదే అనుకున్నప్పటికీ ఫ్రెంచి ప్రజలు మాత్రము అదృశ్యులుగాలేరు. వారికిగూడ మనకువలెనే ఒకభవిష్యత్తు వుంది. లోగడ ఘటనలను సరిగా అవగాహన చేసికోనిదే మనం మంచి భవిష్యత్తును ఏర్పరుచుకోలేము. అందుచేత ఫ్రాన్సు పతనం జెందడానికిగల కారణాలను తెలిసికున్నప్పుడే, ఫ్రెంచి ప్రజలు తమభవిష్యత్తును సరిగానిర్మించుకో గల్గుతారు.

ఫ్రాన్సు పతనంజెందడానికి కారణాలు తెలిసికోవాలంటే ముందు పతన మొందిన ఫ్రాన్సు ఎట్టిది? ప్రస్తుత పైపైను పాలకవర్గంచేత అమ్మివేయబడినటువంటి ఫ్రెంచి రిపబ్లికు ఎలాంటిది? అంతత్వరలో నాశనం గాడానికి ఫ్రాన్సు

లోని క్రుళ్ళుఎట్టిది? అనే విషయాలు తెలిసికోవలసి యుం టుంది. ఇప్పుడు పతనమొందిన ఫ్రెంచిరిపబ్లిక్ 150 ఏండ్ల క్రితం, 1789 ఫ్రెంచి మహావిప్లవానంతరం ఏర్పడిన మొదటి రిపబ్లిక్కు, 1848-51 వరకువున్న రెండవ రిపబ్లిక్కు, యిదివార సత్వం వహించినట్టిది. ఇది మూడవ రిపబ్లికు. ఈరిపబ్లికు త్రివర్ణ పతాకము, స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరభావం అనే సూత్రాలపై ఆధారపడియుంది. ప్రతిఏడాది జూలై 14 న ప్రభుత్వ పండుగ దినము.

1. ఫ్రెంచి మహావిప్లవంలో ఫ్రెంచిప్రజలు బాస్టి లిని నాశనం గావించారు. బాస్టిలి ఫ్రాన్సులోనికల్లా పెద్దజైలు. అందులో విప్లవనాయకులందరు బంధించబడ్డారు. ఫ్రెంచి మహావిప్లవకాలంలో ఫ్రెంచిప్రజలు యీజైలును హతమార్చి వారినాయకులను విడుదల గావించారు. అప్పటి నుండే ప్రతిఏడాది ఆతేదీ-బాస్టిలిని నాశనంచేసిన తేదీ- ప్రభుత్వ పండుగ అయింది.

1939 జూలై 14 న గూడ యీ పండుగయొక్క 150 వ వార్షికోత్సవం జరుపబడింది. 1940 జూలైలో ఫ్రెంచి రిపబ్లికు అదృశ్యమయింది. త్రివర్ణపతాకం పోయింది. ఆ పండుగ దినమే గుర్తురాలేదు. మిలటరీ అపజయాలు— సంధులు జరిగాయి.

అయితే ఫ్రాన్సు యింతత్వరలో యిలా మారిపోడానికి కారణాలేవి? లోగడకూడ అనేక మిలటరీ అపజయాలు

గల్గాయిగాని ఏ సందర్భములోనూకూడ ఇలాంటి మార్పులు జరిగి యుండలేదు. అందుచేత సరిఅయిన కారణాలను తెలిసికోవాలంటే మూడవ ఫ్రెంచి రిపబ్లికుయొక్క పునాది నుండిగూడ ఫ్రెంచి చరిత్రను సూక్ష్మంగా అర్థంచేసికొంటూ రావలసి యుంటుంది. ఈ మూడవ రిపబ్లికు 1870-71 ఘటనల (ఫ్రెంచి—ప్రష్యాయుద్ధము, పారిసు కమ్యూను)పైనను, కమ్యూనును నాశనంజేసినదాని పైననూ ఆధారపడి నిర్మింపబడింది. ఫ్రెంచి ప్రష్యాయుద్ధ కాలంలో ఫ్రాన్సులోని కార్మికులు, ప్రజాసామాన్యము తిరుగుబాటు జేస్తున్నారు. లూయీ నెపోలియన్ యీ ప్రజాసంరంభాన్ని అణచలేక పోయారు. ఫ్రెంచిదేశంలోనే విప్లవ భయంవలన బాహ్య శత్రువుతో బలమయిన యుద్ధము చేయలేక పోయారు. ఫ్రెంచి సామ్రాజ్యం కూలిపోయింది. ఫ్రెంచి చక్రవర్తి ఇంగ్లండుకు పారిపోయాడు. కొలదినెలలు గడచిన పిమ్మట 'థైర్సు' నాయకత్వం వహించిన ఫ్రెంచి తాత్కాలిక ప్రభుత్వానికి—ప్రష్యాకు మధ్య పారిసుప్రజల కోరికకు వ్యతిరేకంగా సంధి చేసుకోబడింది. ఈ తాత్కాలిక ప్రభుత్వం ఫ్రెంచి ధనికులకే ప్రాతినిధ్యం వహించింది. కాని నేషనల్ గార్డు యూనియన్‌లో సంఘటిత పర్చబడి, ఆయుధధారన చేతనయిన వారంతా గలసి ఒక కమ్యూనును ఎన్నుకున్నారు. సంధిజరిగిన కొలది వారాలలోనే ఒకవైపు ప్రష్యాసైన్యము ఫ్రాన్సులో చాలభాగాన్ని ఆక్రమించుకొనివున్న సమయంలో ఫ్రాన్సు తమదిగా రెండు ప్రభుత్వాలు ఎంచుకుంటున్నాయి.

'థైర్సు' నాయకత్వము వహించిన ఫ్రెంచి ప్రభుత్వము వర్సెల్సులో కార్యస్థానమును ఏర్పరచుకుని, కమ్యూనిస్టు సంఘటిత పరుపబడి సాయుధధారులయిన పారిసు ప్రజలను అణచుటకై బిస్మార్కుతో త్వరలో సంధికుదుర్చుకోడానికిఆతురతతో వుంది. 1871 మార్చి 18 వ తేదీన కమ్యూన్ ఏర్పడింది. అది ఏర్పడిన కొలది దినాలలోనే పారిసు ప్రజలు వర్సెల్సులో వున్న 'థైర్సు' ప్రభుత్వంయొక్క సాయుధ తిరుగుబాటును ఎదుర్కోవలసి వచ్చించి. ఆవిధంగా నిజమైన రిపబ్లికును, మార్గదర్శకమైన కష్టజీవుల ప్రభుత్వాన్ని, స్థాపించ పూనుకొనిన పారిసు ప్రజలు అప్పుడే అంతర్యుద్ధాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఆ అంతర్యుద్ధము కొలది దినాలలోనే-మే 28 తేదీని-కమ్యూన్ ఓడించబడుటతో ముగిసింది. 70 దినములు మాత్రమే పాలించిన పారిసు కమ్యూను యిదివరకెన్నడూ కనివిని ఎరుంగని నూతన కష్టజీవుల ప్రభుత్వాన్ని ఏర్పరచి రానున్న విప్లవాలకు మార్గదర్శి అయింది. కార్మిక కుటుంబాలకు జెందిన ముప్పదివేలకు తక్కువలేకుండా స్త్రీ, పురుషులు, పిల్లలూ, రక్తపాతంలో ముంచబడ్డారు. ఇలా చిత్రవధ గావింపబడిన వారేగాక యింకా వేలకొలది కార్మికులు ఫ్రెంచి గియూనాకు ఖైదీలుగా పంపబడ్డారు.

కమ్యూనును రక్తపాతంలో ముంచివేసిన జమీందారులకు మరల నూతన రాజ్యాంగవిధానాన్ని ఏర్పరచడం ఒక సమస్య అయింది. అభివృద్ధి నిరోధకులయిన యీ జమీందారులు కమ్యూనును, సోషలిస్టు చైతన్యంగల పారిసు శ్రమ

వీధులను రక్తపాతంలో ముంచినప్పటికీ, ప్రజాస్వామ్య సూత్రాలకు పూర్తి వ్యతిరేకమయిన రాజ్యాంగ విధానాన్ని ఏర్పరచడానికి నిశ్చయించుకున్నప్పటికీ, రాచరికాన్ని స్థాపించడానికి మాత్రము సాహసించ లేకపోయారు. అలానాల్గేండ్లు కాలం గడిచెను. ఫ్రెంచి ప్రజాసామాన్యంయొక్క వ్యతిరేకతే యిందులకు కారణం. 1830 లోని ఆర్లియన్ రాజరికం 1841 ప్రజాస్వామ్య ప్రభుత్వంతో తుడుచుకుపోయింది. 1852 లోని రెండవ రాచరిక ప్రభుత్వం 1870 లో పునాదులే లేవగొట్టబడి కమ్యూన్ ఏర్పడుటతో నాశనమయింది. కాబట్టి రాచరికాలు యీ విధంగా దాదాపు పదిఏండ్లకొకసారి ప్రజావిప్లవాలను అణచవలసి వస్తున్నది. ఆ ప్రజావిప్లవాలను తాము శాశ్వతంగా అణచి వేయలేక పోతున్నారనీ, మరల ఎప్పుడో ఒకప్పుడు విప్లవాలు వస్తాయనీగూడ బోధపడింది. ఆ కారణంగా ఫ్రాన్సులో జమీందారీపాలన స్థాపించుట అసాధ్యమనీ, ఫ్రాన్సు యికముందు ప్రజాస్వామ్య రాజ్యంగా వుండక తప్పదని అప్పుడు అధికారంలోవున్న ఫ్రెంచి జమీందారులు అందుకు ఓటుచేశారు. ఈనిర్ణయం తాత్కాలికంగానే భావించి ఫ్రాన్సులో మరల రాచరికాన్ని ఏర్పరచడానికి మంచి సమయంకొరకు చూస్తున్నారు. అప్పటి ఫ్రాన్సు అధ్యక్షుడు మార్షలు మాక్మాహన్ రాజరికాన్ని ఏర్పరచడానికి తీవ్రప్రయత్నాలు గావించి తుదకు 1877 లో యీ ప్రయత్నంలోనే ఓడిపోయారు. అయినప్పటికీ చాలమంది జమీందారులు యీ ప్రజాస్వామ్య ప్రభుత్వం కార్మికులచే కూల

ద్రోయ బడుతుందనే భావించి ఫ్రాన్సులో ఎలాగయినా జమీందారీ పాలనకే ప్రయత్నించ సాగారు.

1875 లో ఏర్పడిన యీ ఫ్రెంచి రిపబ్లిక్ యొక్క పునాది, అంగములుగూడ చూడవలసి యుంటుంది. మొదటి (1788) ఫ్రెంచి రిపబ్లికుతోగాని, రెండవ (1848) రిపబ్లికుతోగాని దీనికి ఎట్టిసామ్యమూ లేదు. అప్పుడు అధికారంలో వున్న జమీందారులంతా తామలా శాశ్వతంగా ఫ్రాన్సును పరి పాలించుతూ కోటీశ్వరులుగా తయారవాలనీ, మరలా ప్రజా తిరుగుబాటుయొక్క ఛాయలుగూడ కన్పించకుండా చేయా లని నిశ్చయించుకున్నారు. ఆర్థిక జీవితమంతా తమ గుప్పె ళ్లలోగల యీ ఫ్రెంచి భ్యాంకర్లమూతా రాచరికాన్ని నాశనం గావించి ప్రజాస్వామ్యమనే మిషతో దోపిడి సాగించ ప్రారం భించింది. ఈ రిపబ్లిక్ యొక్క స్వభావం కొలదిమంది భాగ్య వంతుల చేతులలో సర్వాధికారమూ వుంచబడి, ప్రజా సామాన్యము రిపబ్లిక్ యొక్క ఛాయలతో సంతసపడే లాగున ఏర్పడింది.

ఫ్రెంచి రాజ్యాంగ విధానము బ్రిటను రాజ్యాంగ విధానముకంటె ఎక్కువ ప్రజాస్వామ్య చిహ్నములు గల్గి యున్నదని చెప్పవచ్చును. ఎందుచేతనంటే ఫ్రాన్సులో మంత్రి వర్గమే బాధ్యత వహించినటువంటి ఫ్రెంచి శాసనసభకు నాల్గేండ్లకొకపర్యాయం తప్పక తిరిగి ఎన్నికలు జరుగు తుంటాయి. ఈ నాలుగేండ్లకాలము ముగియక మునుపే ఈ శాసనసభను రద్దుచేయవలసినదిగా ప్రధాని శాసనసభాధ్యక్షుని

కోరుటకు వీలులేదు. బ్రిటనులో అలాకాకుండా తిరుగు బాటు దారులుగు లేదా, స్వేఛ్ఛాపరులుగు పార్లమెంటు సభ్యు లను ప్రభుత్వము బలపరచినప్పుడు యీ పార్లమెంటును రద్దుజేసి తిరిగి ఎన్నికలు జరిపించవలసిందిగా రాజుగారిని ప్రధాని కోరవచ్చును. మరలా ఎన్నికలకు నిలబడి పోటీచేసిన ఆర్థికవ్యయ ప్రమాణాలకు లోనుగావలసి వస్తుంది. అలాం టప్పుడు మంత్రుల అధికారాలను హెచ్చు చేయడం, పార్లమెంటు సభ్యుల అధికారాలను తగ్గించడం జరుగు తుంటుంది.

## ఫ్రాన్సులోని పార్టీలు

ఈ శతాబ్దంలో ఫ్రెంచి ఛాంబరులో దాదాపు 12 పార్టీలవరకూ వుంటూ వచ్చినాయి. ముఖ్యంగా వీటన్నింటిని అతివాదపార్టీలు, మితవాద పార్టీలు, సెంట్రలు పార్టీలని మూడు పార్టీలుగా విభజింపవచ్చు.

కొద్ది ఏండ్ల క్రితమువరకుగూడ ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ యీ అతివాదపార్టీల ముఠాలో చేరియుండేది. మితవాద పార్టీలగుంపుతో చివరకు ఫాసిస్టులుగా మారిన రాచ రికపు ముఠా వుండేది. ఫ్రెంచి బ్యాంకులకు, పెద్ద వ్యాపారస్తులకు, మఠాధిపతులకు, అన ఆర్థికంగా జీవిత మంతా హస్తగతం చేసికొనివున్న ధనవంతులకు యీ మిత వాద పార్టీలు ప్రాతినిధ్యం వహించేవి. సెంట్రలుపార్టీలు బ్రిటనులోని అతివాద కన్సర్వేటివు పార్టీలవలె మొదటి

వారితోగాని రెండవ వారితోగాని గలసి ప్రభుత్వాన్ని ఏర్ప రుస్తుండేవి. అతివాద పార్టీలలో కొద్దికాలము వరకూగూడ బ్రిటనులోని లిబరలుపార్టీకి పోల్చగల రాడికలు సోషలిస్టులు ప్రధానస్తానం వహించారు. ఆపార్టీకి ఇడార్డ్ హీరియట్, దలా దీరునాయకులు. చిన్నచిన్న సోషలిస్టు గ్రూపుల కలయికతో ఫ్రెంచి సోషలిస్టుపార్టీ ఈ శతాబ్దారంభములోనే బయలుదేరి 1914 వరకు జార్సు, మార్సెల్, కాఛిన్, జూల్స్‌గ్యూస్‌డే మొదలగు వారిచే నడుపబడుతూ వచ్చింది. అప్పుడూ యిప్పుడూగూడ బ్రిటిషు లేబరు పార్టీకి ఫ్రెంచి సోషలిస్టు పార్టీకి నిర్మాణములోనే యెలాంటి సంబంధమూ లేదు. వ్యక్తి గత సభ్యులమీదనే ఫ్రెంచి సోషలిస్టుపార్టీ ఆధారపడివుంది. ఫ్రెంచి కార్మిక సంఘాలు ఫ్రెంచి సోషలిస్టు పార్టీలో భాగాలు కాకపోవడమే గాకుండా రాచకీయాలలో పాత్ర వహించిడానికిగూడ వ్యతిరేకము.

## ఫ్రెంచి సామ్రాజ్యాభివృద్ధి

నవీన పారిశ్రామిక దేశాలలో తప్పనిసరిగా క్రమేణా అధికారమంతా చాలకొద్దిమంది ధనికుల చేతుల లోనికి పోతుంది. వారే పరిశ్రమలకు, బాంకులకు అధికారు లవు తారు. కార్మికులయొక్క, ప్రజాసామాన్యం అందరియొక్క జీవనాధారసమస్య వారిచేతులలోనే వుంటుంది. ఫ్రాన్సె 1875 నుండి పారిశ్రామికంగా అభివృద్ధి గాజొచ్చింది. ఫ్రెంచి రిపబ్లిక్ ఏర్పడిన తర్వాత అది వలసదేశాలను కబళించ మొద లిడింది. బిస్మార్కు అనుమతితో జూల్సు ఫెర్రి నాయకత్వం

కింద ట్యూనిస్‌ను ఆక్రమించుకుంది. ట్యూనిస్‌ను ఆక్రమించుకుంటే అప్పుడే తలయెత్తుతున్న ఇటలీకి—ఫ్రాన్సుకు దెబ్బలాట తప్పదనే ఎత్తుతో బిస్మార్కు యిందుల కంగీకరించాడు. ట్యూనిస్‌తోపాటు చైనాకు చెందిన టాంకింగ్ రాష్ట్రమును, అనామ్, కాంబోడియాలనుగూడ వశపర్చుకుంది. వీటితోపాటు కొచిన్ చైనా, లావ్‌లనుగూడ వశపర్చుకుంది. దానితో యిప్పటి ఫ్రెంచి యిండో చైనా ఏర్పడింది. 1890 లో బ్రిటను అనుమతితో ఆఫ్రికా తూర్పు తీరానవున్న మెడగాస్కర్‌ను లాక్కుంది. బ్రిటను జాంజిబారును వశపర్చుకుంది. అదేసమయంలో పశ్చిమ ఆఫ్రికాలోని ఫ్రెంచిప్రదేశము నైగరునదినుండి డాహోమే, టింబక్టు, సెనిగాల్ వరకు విస్తరించ బడింది.

జర్మనీ బలపడడం చూచి 20 శతాబ్దారంభంలో బ్రిటను, ఫ్రాన్సులు ఒడంబడికలు చేసికోసాగాయి. న్యూఫౌండు లాండులోని కొన్నిహక్కులను ఫ్రాన్సు వదలుకుంది. తనకు ఈజిప్టుపై ఆశలేదని చెప్పింది. దానికి బదులుగా మొరాకోలోను, ఆఫ్రికాలోని తనభాగాలలోనూ తనపెత్తనం సాగడానికి బ్రిటను అంగీకరించింది. 1907 లో ఫ్రాన్సు సయాం (యిప్పటి థాయ్‌లెండు) లోని మూడురాష్ట్రాలను వశం జేసికుంది.

ఇలా వలసదేశాలను సంపాదించడంతో ఫ్రెంచి వలసదేశ ప్రజలసంఖ్య 1876 లోని 60,00,000 నుండి 1899 లో 5,60,00,000 కు పెరిగింది. ఈ సంఖ్య 1914—18 యుద్ధా

సంతరానికి యింకా పెరిగింది. గత శతాబ్దం ఆఖరుకు వలస దేశాలను అధీనం జేసుకోడంలో ప్రపంచంలో ఫ్రాన్సు రెండవ స్థానం అలంకరించింది. ఫ్రాన్సు జర్మనీకంటె నాల్గురెట్లున్నూ అమెరికాకంటె ఆరురెట్లున్నూ వలసదేశాలను గల్గియున్నది.

అందుచేత 1914—18 యుద్ధము ప్రారంభం కాబోయే ముందు వలసదేశాలలో పదింట తొమ్మిదివంతులు బ్రిటను-ఫ్రాన్సుల అధీనంలో వున్నాయి. కాబట్టి యీ శతాబ్దారంభంలో చైనా, పర్షియా, ఒట్టోమన్ రాజ్యము (యివి కొంత వరకు వలసదేశాలనేచెప్పాలి) మినహా యికయేవిన్నీ మిగలలేదు. 1900 లకు వలసదేశ ప్రపంచమంతా వివిధ సామ్రాజ్యవాద దేశాలమధ్య పంచుకోబడింది. వీటిని తిరిగీ పంచుకోవలసిన అగత్యంగూడ యేర్పడింది. అలా పంచుకోవడానికి చిన్న సామ్రాజ్యవాద దేశాలు పెద్దవాటికి లొంగైనాపోవాలి. లేదా, యుద్ధాలయినా ఆరంభంకావాలి.

## మూడురాజ్యాల ఒడంబడిక

ఫ్రాన్సు వలసదేశాలను కబళించ మొదలిడి నప్పటినుండేగూడ దినదినానికి బలపడుతూవున్న జర్మనీని ఒక కంటితో చూస్తూనేవుంది. జర్మనీని ఎదుర్కొ-వాలంటే తాను మిత్రరాజ్యాలను వెతకవలసి యుంటుంది. 1900 ఆరంభంలో ఫ్రాన్స్ రష్యాలోని జారుప్రభుత్వంతోనూ, 1904లో బ్రిటనుతోనూ, ఒడంబడికలు గావించుకుంది. 1904 లో రష్యా జపానుల యుద్ధం ప్రారంభమయింది. ఈ యుద్ధఫలితంగా

1905 లో రష్యాలో ప్రజావిప్లవం జరిగింది. ఆ విప్లవాన్ని నాశనం చేయడానికి బ్రిటను ఫ్రాన్సులు జారుకు చాల సాయం చేసినాయి. ఆ కారణంచేత 1907 లో యీ మూడు దేశాల (రష్యా, బ్రిటను, ఫ్రాన్సు) మధ్య ఒడంబడిక (త్రైరాజ్య సంధి) జరిగింది. జర్మనీ, ఆస్ట్రియా–హంగరీ, ఇటలీ సామ్రాజ్యాల కూటమికి వ్యతిరేకంగా యీ రష్యా, బ్రిటను, ఫ్రాన్సుల కూటమి త్రిప్పబడింది. ఈ మూడు రాజ్యాల కూటమివల్ల ఫ్రాన్సు అధికంగా లాభం పొందిందేమీ లేదుగాని మొరాకోలో మాత్రము తన ప్రాబల్యాన్ని వృద్ధిజేసికొని బలపరుచుకుంది.

ఈ రెండు ముఠాలు పోటీలుపడసాగాయి. ఈ రెండు కూటమీలకు లోగడనుంచీ అనుకుంటూన్న మొరాకోపై గాక బాల్కను రాష్ట్రాల సమస్యపై ఘర్షణ హెచ్చింది. జర్మనీ బాల్కన్లను, ఏషియామైనరును వశం జేసికోదలచింది. బెర్లిను–బాగ్దాదు రైల్వేను స్వాధీనం జేసికో దలచింది. చిట్ట చివరకు 1914 ఆగష్టు 1 తేదీని యుద్ధం (మొదటి సామ్రాజ్యవాద యుద్ధం) ఆరంభమయింది.





పాల్ రేనాడ్

ఫ్రెంచినాయకుడు. జననం 15 అక్టోబరు 1878. పారిస్ నగరంలో న్యాయవాదిగా వుంటూవచ్చాడు. గడచిన మహాయుద్ధంలో—1914–18 లో పాల్గొన్నాడు. 1928 లో మొదటిసారి మంత్రిఅయినాడు. దలెడియర్ మంత్రివర్గంలో 1938 ఏప్రిల్ నుంచి 1940 మార్చివరకు మంత్రిగా వున్నాడు. ఫ్రాన్సు ఆర్థికపరిస్థితిని కొంతవరకు చక్కబెట్టాడు. హిట్లరు, ముసొలినీలను సంతృప్తిపరచు విధానాన్ని తీవ్రంగా ఖండించాడు. ఫాసీజాన్ని రూపుమాపను, యుద్ధం తీవ్రతరం చేయబడాలని పోరాడాడు. 1940 మార్చి 23 న ఫ్రెంచిప్రధాని అయ్యాడు. ఫ్రాన్సు పతనకాలంలో పెటైన్ ప్రభృతులచే తొలగింపబడ్డాడు. తదనంతరం చంపబడ్డాడని, కారు ప్రమాదంలో చిక్కాడని, పెటైన్ చే ఖైదీచేయబడ్డాడని వదంతులేర్పడ్డై.

# 2. 1918 అనంతరం

మొదటి ప్రపంచయుద్ధంలో (1914-18) మిత్రమండలి రాజ్యాలు గెలుపొందినాయి. తనయొక్క నౌకాబలం ముట్టడించడం (బ్లాకేడు)మూలంగానే జర్మనిఓడుట తటస్థించిందని బ్రిటిషు ప్రభుత్వమూ; కాదు—జర్మని ఓటమికి తనసైన్యాలే కారణమంటూ ఫ్రాన్సు; యివేవీగావు—ఆర్థికంగానూ, పరికరాలద్వారానూ, తానింకా సప్లయిచేసిన మనుష్యుల హంగువల్లనే ఓడించవని అమెరికాదేశము, ప్రగల్భాలు కొట్టసాగాయి. కాని జర్మని సేనానాయకుడగు జనరలు లుడెన్‌డార్ఫ్ పైవాటికి వేనికీగూడ ప్రాముఖ్యత యివ్వలేదు. జర్మను సైన్యాలలోనూ, జర్మను ప్రజాసామాన్యంలోనూ బోల్షివిజం వ్యాపించుటే జర్మనుపతనానికి ప్రధానకారణమంటూ బోల్షివిజంపై దుమ్మెత్తిపోశాడు.

జర్మను పతనానికి కారణమేదైనప్పటికీ ఫ్రెంచి అధికారవర్గం మాత్రం జర్మనీ శాశ్వతంగా పతనమొందిందనీ, దానియొక్క పూర్తిఫలితాలను తాననుభవించవచ్చుననీ కులుకసాగింది. ఫ్రెంచి సామ్రాజ్యముయొక్క విస్తీర్ణము, పలుకుబడిగూడ హెచ్చింది. అల్సేక్, లో రైన్ పరపీడనుండి బయటబడడమూ, జర్మనీయొక్క పశ్చిమ ఆఫ్రికా వలసదేశాలు బ్రిటను ఫ్రాన్సులమధ్య పంచుకోబడడమూ,

యింతేగాకుండా సారవంతమయిన సిరియా ప్రదేశంగూడ ఒట్టోమన్ సామ్రాజ్యంనుండి పెరికివేయబడడం జరిగింది.

దీనితో ఐరోపాదేశంలో ఫ్రాన్స్ బలపడింది. ఆస్ట్రియా—హంగరీ రాజరికం తొలగించబడింది. జర్మనీ ఆల్సేక్—లోరైన్‌లను ఫ్రాన్స్‌కేగాక యింకా కొంతపారిశ్రామిక ప్రదేశాన్ని పోలండుకు యీయవలసివచ్చింది. బెల్జియంకు 'యూపెన్ మాల్మడే' జిల్లాను యిచ్చింది. రుమేనియా బెస్సరేబియాను తీసికుంది. పోలెండు పశ్చిమయుక్రేనును, పశ్చిమ బైలో రష్యాలను లాక్కుంది.

కాబట్టి యిప్పుడు ఫ్రాన్స్‌తో తులతూగే రాజ్యాలు ప్రపంచంలో బ్రిటను, ఇటలీలు మాత్రమేవున్నాయి. పైకి గొప్పరాజ్యంగా కన్పించుతున్నప్పటికీ ఇటలీని ఫ్రాన్స్ లెక్కజేసేస్థితిలో లేదు. అందువల్ల ఐరోపాలో ఫ్రాన్స్ ఒక ప్రధానస్థానం ఆక్రమించిందనాలి. అయినప్పటికీ ఫ్రాన్స్‌కు లోన ఒకవిధమైన గుండెదడ వుంటూనే వచ్చింది. అది జనాభానుగూర్చిన సమస్య. ఫ్రాన్స్ జనసంఖ్య 4,00,00,000 వుండగా అదేకాలంలో జర్మనీ జనాభా 6,50,00,000 వుంది. ఏదోవిధంగా యీ సమస్యను పరిష్కరించాలనుకుంది. అప్పటి ఫ్రెంచి ప్రధాని మార్షల్ ఫాక్ తన సరిహద్దును రైన్‌నది వరకు పెంచుకోవాలని ప్రయత్నం చేయసాగాడు. కాని అమెరికా, బ్రిటనులు దీనికి అంగీకరించలేదు. అంతేగాకుండా తీరా యుద్ధముప్రారంభించితే ఫ్రాన్స్‌లో తిరిగి విప్లవం వస్తుందేమో అన్నభయం యింకా పాలకవర్గానికి పోలేదు. అందు

వల్ల ఫ్రాన్సు మరియొకపద్ధతి అవలంబించింది. సరిహద్దు రాజ్యాలగు బెల్జియం, పోలెండు, జెకోస్లావేకియా, రుమే నియా, యుగోస్లేవియాలకు ఆయుధాలు, డబ్బు అప్పుగా యిచ్చి తద్వారా వాటిని దోచుకోవడమేగాక జర్మనీని తిరిగి భాగించుటకు వీటిద్వారా ఎత్తులువేయ నారంభించింది.

ఇక వర్సైలు సంధియొక్క పెత్తనదారులు ఓడిపోయిన జర్మనీని దోచుకోవడమే కాకుండా సోవియట్ యూనియ నును చుట్టుముట్టి హతమార్చడానికి పూనుకున్నారు. ఈ ఉద్దేశంవల్లనే బాల్కనురాజ్యాలను ఏర్పరచారు. ఈ పాత్రలో ఫ్రెంచి పాలకవర్గం నాయకత్వం వహించింది.

జనవరి 1923 లో ఫ్రాన్సు రూర్ ప్రాంతాన్ని ఆక్ర మించసాగింది. అప్పుడు తానున్నస్థితిలో జర్మనీ మిలిటరీ దళా లతో ఫ్రాన్సును ఎదిరించలేనప్పటికీ, సర్వవ్యాపిత సమ్మెలతో సహా యితరమార్గాల ఫ్రాన్సును వ్యతిరేకించింది. ఆకాలంలో జర్మనీలోని 'మార్కు' నాణెమునకు విలువలేకుండాపోయింది. జర్మనీలో విప్లవం మొలకెత్తుతూంది. ఫ్రాన్సులోని 'ఫ్రాంకు' నాణెంయొక్క విలువకూడ తగ్గిపోయింది. ఒక్క రైన్‌లాండు లోనే గాక యూరపునంతటిని కమ్యూనిస్టు భూతము ఆవ రించింది.

బ్రిటను, ఐరోపాలో ఏయితర సామ్రాజ్యంయొక్క ప్రాబల్యాన్ని సహించదు. అందుచేతనే ఫ్రాన్సు బలపడడాన్ని బ్రిటను ఒప్పుకోదు. జర్మనీలోనా విప్లవం రేకెత్తుతూవుంది. అందుచే అమెరికా బ్రిటనులు ఆలోచించి క్రమేపి బలపడు

తూన్న ఫ్రాన్స్‌కు వ్యతిరేకంగా జర్మను సామ్రాజ్యవాదాన్ని పునరుద్ధరించ నిశ్చయించి జర్మనీకి పూర్తిధనసాయం చేశాయి. 1924 లో జర్మనీనుండి ఫ్రెంచిదళాలు వెనుకకు రప్పించబడి నాయి. ఇంతేగాక వివిధసామ్రాజ్యవాద ప్రభుత్వాలు ఆకాలంలో తమతమ స్పర్థలవల్ల పోటీపడజొచ్చాయి.

దీనివల్ల బ్రిటను అమెరికా ప్రభుత్వాలు ఫ్రెంచి ప్రభుత్వంయొక్క ఎత్తులను పునాదిలోనే త్రుంచుతూవస్తున్నా యని బోధపడుతుంది. రాచకీయాలు బలాబలాలమీదే ఆధారపడియుంటాయి. ఫ్రెంచి సామ్రాజ్యవాద లక్షణాలను జాగ్రత్తగా పరిశీలించితే ఫ్రాన్స్‌యొక్క బలహీనత ఎందులో వుందో సులభంగా గ్రహించవచ్చు. ఆ బలహీనత కారణంగా బ్రిటను, అమెరికాలు ఫ్రాన్స్‌ను అరికట్టగలిగాయి. ఇక ఆబల హీనత ఎలాంటిదో తెలిసికుందాం.

1920 లో 'బ్రిటిషు కార్మిక పరిశోధనాశాఖ' యొక్క నెలవారీ ప్రకటనలో ఒక బ్రిటిషు పరిశీలకుడు యిలా వ్రాశా డు. "ఇరువదవ శతాబ్దంలో ప్రపంచఆధిపత్యానికి అయిదు కేంద్రాలుమాత్రమే వున్నాయి. అవి అమెరికా, బ్రిటను, జర్మనీ, రష్యా, జపానులు." అతనివ్రాతలప్రకారం ఫ్రాన్స్‌కు ప్రపంచ ఆధిపత్యానికి తావులేదని తేలింది. రష్యాలో విప్లవం జయంపొంది సోషలిస్టు ప్రభుత్వం ఏర్పడినతర్వాత ప్రపం చంలో యిక నాల్గు పెద్ద పెట్టుబడిదారీ ప్రభుత్వాలే మిగిలి వున్నాయి. ఫ్రాన్స్‌ను యీ కూటమిలో చేర్చడానికి ఎందుకు

ను లేదంటే ఫ్రాన్సు సామ్రాజ్యవాద అభివృద్ధికి కావలసినటు వంటి నవీన పారిశ్రామిక పద్ధతిని కల్గియుండలేదు. గనుక, ఫ్రాన్సుయొక్క పెద్దపెద్ద పరిశ్రమలన్నీగూడా బ్రిటను అమెరికాలలోని పరిశ్రమలవలె ఆధునికమైనవికావు. దానియొక్క సరఫరాలు నిర్ణీతమైనవిగా యుండేవి. కాబట్టి ఫ్రెంచి సామ్రాజ్యవాద ప్రభుత్వం తక్కిన ప్రభుత్వాలతో పోల్చిచూస్తే దోపిడీచేసే విధానంలో వెనుకబడివుందనే చెప్పాలి. ముఖ్యంగా జర్మనీకి పోల్చిచూస్తే పెట్టుబడియొక్క కేంద్రీకరణం ఫ్రాన్సులో చాల వెనుకబడేయుంది.

1875 నుండి 1925 వరకు ఫ్రాన్సుయొక్క ఉత్పత్తి అమెరికా జర్మనీలకు పోల్చితే చాల వెనుకబడింది. 1897 నుండి 1913 వరకు వివిధదేశాలలోని పారిశ్రామికోత్పత్తిని యీ క్రిందిజాబితా తెలియజేస్తుంది.

| | | | | |
|---|---|---|---|---|
| బ్రిటనులో పారిశ్రామిక వుత్పత్తి | | 1897–1913 కు | 35 % | పెరిగింది. |
| ఫ్రాన్సులో | ,, | ,, | 58 % | ,, |
| జర్మనీలో | ,, | ,, | 80 % | ,, |
| అమెరికాలో | ,, | ,, | 100 % | ,, |

ఈ పై విషయాలను బట్టే ఆధునిక పారిశ్రామిక దేశాల బలాలు వుంటాయి. వర్సైల్సు సంధి అనంతరం జర్మనీయొక్క పారిశ్రామికోత్పత్తి కొంత నీరసించినప్పటికీ తర్వాత ఫ్రాన్సు కంటె అధికంగా కోలుకుంది.

## జర్మనీ ఫ్రాన్సుల తారతమ్యం

ఫ్రాన్సుయొక్క యాదార్థస్థితిగతులను అర్థంచేసికోవా

లంటే జర్మనీతో పోల్చి యీ రెంటిబలాల తారతమ్యం చూడాలి.

| (1) పారిశ్రామికోత్పత్తిలో పెంపుదల. | | జర్మనీ | ఫ్రాన్సు. |
|---|---|---|---|
| | 1860 — 1880 ...... | 78 % | 65 % |
| | 1890 — 1913 ...... | 148 % | 79 % |
| | 1913 — 1929 ...... | 13 % | 38 % |
| (2) జనసంఖ్య | 1913 లో ...... | 6,70,00,000, | 4,00,00,000. |
| | 1929 లో ...... | 6 40,00,000. | 4,10,00,000. |
| (3) ఉక్కు ఉత్పత్తి. | 1913 లో (టన్నులలో) | 1,90,00,000. | 50,00,000. |
| | 1929 లో ,, | 1, 62,00,000. | 97,00,000 |

ఆల్సేసు, లోరైన్లను పోగొట్టుకోడంవలన ఉక్కు ఉత్పత్తిలో జర్మనీ తగ్గింది. (ఫ్రాన్సుకంటెగాదు.)

| | | |
|---|---|---|
| 1936 లో (టన్నులలో) | 1,92,00,000. | 62,00,000. |

| (4) ఉత్పత్తిఫలితాల ఎగుమతి. | జర్మనీ, | ఫ్రాన్సు |
|---|---|---|
| 1913 లో | రూ 644,00,00,000. | రూ 64,40,90,000. |
| 1929 లో | ,, 936,00,00,000. | ,, 492,00,00,000. |
| 1936 లో | ,, 576,00,00,000. | ,, 124,00,00,000. |

ఫ్రాన్సు పారిశ్రామికంగా ముందడుగు వేయుటలేదు గాని ఫ్రెంచి రైతుల ఆదాయమంతా ప్రోగుచేసి బాంకులలో నిల్వజేసి తిరిగిజారు ప్రభుత్వానికో లేక యింకా యితర ప్రభుత్వాలకో పొద్దపెద్ద అప్పులు యివ్వసాగింది.

తమదేశీయ ఆదాయాలనుండి అప్పులుపెట్టిన మొత్తం 1930 లో వివిధదేశాలలో యీ క్రిందివిధంగావుంది.

| | | |
|---|---|---|
| ఫ్రాన్సు | — | 15 % |
| అమెరికా | — | 4 % |
| బ్రిటను | — | 18 % |

బ్రిటనుకు పెద్ద సామ్రాజ్యముంది. గొప్పవ్యాపార ముంది. అందువల్ల బ్రిటనుకు యీ పెట్టుబడి ఒకలెక్కలోకి రాదు. కాబట్టి యీ విషయంలో ఫ్రాన్సు 'మార్వాడీ' వలె వడ్డీవ్యాపారం చేస్తున్నదనాలి.

### రెండువందల కుటుంబాలు

ఫ్రెంచి ప్రభుత్వము ఫ్రాన్సులోని రెండువందల కుటుంబాలయొక్క స్వరూపం. కాబట్టి ఆకుటుంబాలను గూర్చి మనం విశదంగా తెలుసుకోవాలి. ఫ్రాన్సులోని బాంకులన్నీ గూడ రెండువందల కుటుంబాల స్వాధీనంలో వున్నాయి. ఫ్రాన్సుయొక్క ఆర్థికాధికారమంతా వీరిచేతులలోనే యుంది. ఫ్రాన్సుకు నిజమైన పాలకులువీరే. ఫ్రెంచి బాంకులోని 40 వేల వాటాదారులలోనూ యీ రెండువందలమంది పెద్దపెద్ద వాటాదారులకే సభ్యులను ఎన్నుకోడానికి అధికారముంది. పరిశ్రమలనుండి, వ్యాపారసంస్థలనుండి ఆర్గురు సభ్యులు, బాంకులనుండి ఆర్గురు సభ్యులు ఎన్నుకోబడతారు. ఫ్రెంచి బాంకుయొక్క సర్వాధికారము ఈపన్రెండుగురిచేతుల్లోనే యుంటుంది. ఇంకా ఎగుమతి దిగుమతులపైన, పెద్దపెద్ద పరిశ్రమలపైనగూడ ఈ పన్రెండుగురిదే అధికార మంతాను. ఇక తక్కిన పరిశ్రమలు, ఆర్థికాధికారం, వ్యాపారం అంతా గూడ ఆ రెండువందల కుటుంబాల చేతులలోనే యుంది. ఫ్రాన్సును పరిపాలించేదే వీరు. వీరిమాటలను చలామణిచేయనప్పుడు ప్రభుత్వాన్ని వూడబీకివేయడం వీరిచేతులలోనే యుంది. ఇలా ఒక ప్రభుత్వం తర్వాత మరియొకదానిని వూడ

బీకివేయడం ఫ్రెంచి రాచకీయాలలో పరిపాటయింది. వీరే ఫ్రెంచి నాణెము "ఫ్రాంకు" యొక్క విలువను చిందరవందర చేస్తారు.

ఈ 200ల కుటుంబాల ప్రముఖులు తమ స్వలాభాల కోసరమని దేశీయ వ్యవహారాలను, దేశీయ క్షేమాన్ని కాల రుద్దివేశేవారు. ఎలాంటి అతివాదపార్టీలు అధికారానికి వచ్చినా యీ పై వారికి దాసోహమనవలసిందే. లేదంటే వూడబీకి వేయబడతామనే భయం తాండవమాడుతుండేది. వుదాహరణకు 1924 లో ఎడ్వార్డు హీరియట్ నాయకత్వం క్రింద ఒక అతివాదపార్టీ అధికారంలోకి వచ్చింది. కాని పది నెలలు నిండకముందే ఫ్రెంచిబాంకు, యీ 200 ల కుటుంబాలు ఆ ప్రభుత్వాన్ని పెళ్ళగించివేశాయి. ఇలానే యీ కుటుంబాలు ఎన్నెన్నో చేతులు మార్చివేశాయి. ఫ్రెంచి పాలకవర్గంలోని దగా కోరుతనం మితిమీరిపోయింది.

## 1929 ఆర్థిక సంక్షోభం

పెట్టుబడిదారీ సమాజంలో ఆర్థికసంక్షోభాలు రమా రమి పదేండ్లకొకసారి వస్తూన్నాయి. 1825 లో మొదటి ఆర్థికక్షోభ వచ్చింది. అప్పటినుండి షుమారు 10 ఏండ్ల కొకసారి యీ ఆర్థికసంక్షోభాలు దెబ్బకొడుతూనే వున్నాయి. ధరలు పూర్తిగాపడిపోవడం; యంత్రాలయాలు మూతబడి నిరుద్యోగం హెచ్చడం; వాటాలరేట్లు పడిపోయి బాంకులు దివాలాదీయడం; మారకపురేటు, దేశంలోని నాణెంయొక్క విలువ తారుమారవడం; వర్తకవ్యాపారాలు, ప్రజాసా

మాన్యంయొక్క జీవిత ప్రమాణం క్షీణించిపోవడం—యివి ఆర్థిక సంక్షోభంయొక్క లక్షణాలు. ఈ సంక్షోభాలకు కారణం పెట్టుబడిదారీ సమాజంలో వుత్పత్తిపరికరా లన్నీగూడా కొలదిమంది వ్యక్తుల లాభాలకొరకే పని చేయబడుతున్నాయి. లాభాలే ఆదర్శంగాగల పెట్టుబడిదారులు తమకు లాభాలు రావడానికి కార్మికులకు తక్కువ జీతాలు యివ్వవలసియుంటుంది. అందువల్ల కార్మికులకు ప్రజాసామాన్యానికీ, కొనుగోలుశక్తి చాలతక్కువగా యుంటుంది. ఉత్పత్తిఅయిన వస్తువులన్నీ అమ్ముడుబోక నిల్వవుండడంచేత పెట్టుబడిదారులు యంత్రాలను మూయడం, కొన్నికొన్ని పరిస్థితులలో వుత్పత్తి అయిన సరకులనుగూడ నాశనం జేయడం జరుగుతుంది. అంటే పెట్టుబడిదారీ సమాజంలోని వుత్పత్తి అవుసరాన్ని బట్టి (ఒకప్లాను ప్రకారం) కాకుండా లాభంకొరకు చేస్తుంటారు గాన యిలాంటి సంక్షోభలు ఒకదాని తర్వాత మరియొకటి రాక తప్పదు.

1929 లోని ఆర్థిక సంక్షోభం లోగడవాటికంటే చాల తీవ్రమయినదని అందరూ అంగీకరించారు. అమెరికాలో ఆరంభమయి కొలది నెలలలోనే ప్రపంచాని కంతకూ ప్రాకి పోయింది. ఒక్క సోవియట్ యూనియను మినహా తక్కిన ప్రపంచమంతా యీఆర్థిక సంక్షోభంలోపడి నలిగిపోయింది. మొదట్లో దీని ప్రభావము ఫ్రాన్సులో కన్పించకపోయినా 1931 చివరభాగములో ఫ్రాన్సులోగూడ ఆరంభమయి చాల తీవ్రరూపం దాల్చింది. ఈ ఆర్థిక సంక్షోభాన్నుండి కోలుకో

డానికి యితరదేశాలకంటె ఫ్రాన్సుకు ఎక్కువ వ్యవధికావలసి వచ్చింది. ఫ్రాన్సులో నిరుద్యోగం హెచ్చిపోవడంవల్ల యిదే అవకాశంగా తీసికొని యజమానులు కార్మికుల జీతాలు విపరీతంగా కోసివేశారు. వ్యవసాయ వస్తువుల ధరలుగూడ పూర్తిగా పడిపోయాయి. తమతమ కష్టాలనుండి బయటబడడానికి కార్మికుల, రైతులు, యింకా మధ్యతరగతి ప్రజలు మార్గాలు వెదుక నారంభించారు. దానిఫలితం 1932 లో జరిగిన ఎన్నికలలో వీరంతా అతివాద మతాలను బలపర్చారు. ఈబాధనుండి బయటబడే నిమిత్తం గత్యంతరంలేక ఫ్రెంచి పాలకవర్గం ఫాసిజంవైపుకు మొగ్గ నారంభించింది. జర్మనీలో ఫాసిజం అధికారంలోనికి వచ్చినప్పటినుండీకూడ ఫ్రాన్సులోగూడ ఫాసిజం మొలకెత్తింది-విజృంభించ సాగింది.

ప్రభుత్వ అంచనాల ప్రకారమే ఫ్రాన్సులో కార్మికుల జీతాలు 17% తగ్గించబడినాయి. నిజానికి యీ జీతాలకోత దాదాపు 30 % తగ్గించబడింది. ఈ 30% నెల జీతగాండ్ర విషయంలో కన్పించింది. వస్తువులధరలు మాత్రము 11 % నుండి 17 % వరకూ తగ్గాయి. మొత్తంమీద ప్రజాసామాన్యంయొక్క దుర్భరస్థితి మితిమీరిపోయింది. ఉత్పత్తి విషయంలోకూడ యీ ఆర్థికసంక్షోభంవల్ల ఫ్రాన్సు చాల దెబ్బతిన్నది.

| | | | | |
|---|---|---|---|---|
| 1913 లో | ముఖ్య పరిశ్రమల | ఉత్పత్తి | 100 | వుంటే, |
| 1929 లో | ,, | ,, | 140 | వుంది. |
| 1930 లో | ,, | ,, | 130 | ,, |
| .931 లో | ,, | ,, | 105 | ,, |

ఇనుము, ఉక్కు, వుత్పత్తి 1932 లో 90
1933 లో 92
1934 లో 85 వుంది.

ఇక గనులు, బట్టలమిల్లులు, తోలుపరిశ్రమ, రబ్బరు పరిశ్రమ మొదలగునవి
1932 లో 100
1933 లో 110
1934 లో 90 వుంది.

ఇంకా దివాలాతీసినవారు 9% కంటె ఎక్కువయ్యారు. వూలు, సిల్కు పరిశ్రమలలోని వుత్పత్తిగూడ తగ్గిపోయింది.

కాబట్టి దేశంలోని నిర్మాణం అంతా యిలా తారుమారయేటప్పుడు ఏ ఆధునిక పారిశ్రామిక దేశమయినా యీ ఆర్థికక్షోభలనుండి బయటబడడానికి అటు ఫాసిజంవైపుకైనా మొగ్గాలి—లేదా ప్రజాస్వామిక పద్ధతుల వైపుకన్నా మొగ్గాలి వేరే గత్యంతరంలేదు. ఫ్రాన్సులో ఫాసిజం యెలా ప్రబలిందో రానున్న అధ్యాయంలో చూద్దాం.





హెన్‌రీ ఫిలిప్ పెటైన్

ఫ్రెంచి సేనానాయకుడు. జననం 1850. 1878 నుంచి సైనికోద్యోగిగావున్నాడు. 1914 లో సేనానాయకుడయ్యాడు. 1916 లో వెర్‌డన్‌ను కాపాడి ఖ్యాతిగాంచాడు. 1917 లో ఫ్రెంచి ప్రధాన సేనానాయకు డయ్యాడు. 1918 లో మార్షెల్ అయ్యాడు. 1925-26 లో ఫ్రెంచి మొరక్కోలో జరిగిన తిరుగుబాటును అతిక్రూరంగా అణచివేశాడు. 1920-30 యుద్ధసమితికి ఉపాధ్యక్షుడుగా నున్నాడు. 1936 లో జరిగిన ఫాసిస్టుకుట్రల్లో యీతనికి భాగముంది. 1940 మేలో రేనాడ్ మంత్రివర్గంలో చేరాడు. 1940 జూన్‌లో ఫ్రాన్సు పూర్తిగా హిట్లరుకు లొంగడానికి యితనుగూడా కారకుడయ్యాడు. ప్రస్తుతం జర్మను లాక్రమించని ఫ్రాన్సుకు నియంత. ప్రజాస్వామ్యాన్ని రూపుమాపాడు.

# 3. ఫాసిస్టు ధోరణి

కొలది ఏండ్ల క్రితంవరకూగూడ బ్రిటిషు రాచకీయ వేత్తలు, ఫాసీజం జర్మనీలోనో, లేక ఇటలీలోనో రావచ్చును గాని బ్రిటను, ఫ్రాన్సులలో తలఎత్తుటకు ఎట్టి అవకాశమూ లేదని వాదిస్తూండేవారు. అలా వూహించినవారు చాల పొరబడ్డారన్న మాట. ఈ యుద్ధము ప్రారంభమయినప్పటి నుండీ, ప్రారంభించిన 9 నెలల తర్వాతవరకుగూడ వీరు ఫ్రాన్సులో ఫాసీజం ప్రబలివున్నదనే సత్యాన్ని అవగాహన చేసి కోకపోగా ఫ్రాన్సులో జరిగే ఘటనలకన్నింటికీ ఏవో డొంక తిరుగుడు సంజాయిషీల నీయసాగారు. ముఖ్యంగా ఒక ప్రత్యేక మతావల్ల గాని, కొన్ని మతాల సమ్మేళనమువల్లగాని, కొన్ని ప్రత్యేక తెగలు లేక జాతులవల్లగాని ఫాసిజం స్థాపించబడ దనీ, ఆధునిక రాజ్యాంగవిధానం—అంటే సామ్రాజ్యవాద వ్యవస్థ—ఒకానొకదశకు రాగానే ఫాసిజం వుద్భవించక తప్ప దనే విషయాన్ని మనం గ్రహించవలసి వుంటుంది. గత యిరు వది ఏండ్ల నుండి పెట్టుబడిదారీ విధానంలో నడుపబడుతూన్న దేశాలన్నీగూడా సంక్షోభాలలో యిరుక్కుపోయి నానా అవ స్తలు పడుతున్నాయి. వుదాహరణకు 1932 లో ప్రతి నల్గు రిలోనూ ఒక్కరూ, కొన్ని ప్రత్యేక పరిశ్రమలలో ప్రతి యిద్ద రిలోనూ ఒక్కరూ నిరుద్యోగులుగా తయారయ్యారు. అలాంటి

సమాజం అభివృద్ధికరమైన దశనుండి క్షీణించే దశకు తయా రయిందన్నమాట. ఆవిధంగా క్షీణించసాగిన సమాజానికి రెండే మార్గాలున్నాయి. మొదటిది సోషలిస్టు సమాజంగా నైనా మారాలి. లేదా యీ క్షీణదశలో వున్న సమాజాన్ని అదేవిధంగా అణచివుంచడానికి తీవ్రప్రయత్నాలు అయినా చేయాలి. అలాంటప్పుడు ఆ సమాజంలో లోగడ వుండినటు వంటి రాచకీయస్వేచ్ఛ, వాక్సభాస్వాతంత్ర్యాలు వుండుటకు (రెండవమార్గం ప్రకారము) వీలులేదు. రెండవమార్గాన్ని అవ లంబించినప్పుడు, అంటే ఫాసిజం ఏర్పడినప్పుడుగూడ లోగడ వున్నటువంటి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు, తదితర పౌరసత్వ హక్కులు వున్నట్లయితే ప్రజాసామాన్యం దినదినానికి పెచ్చు పెరుగుతున్న తమ కష్టాలనుండి బయటబడడానికి, తమతమ సంఘాలనూ దిట్టంగా బలపర్చుకుని ప్రస్తుతం వున్న పాలక వర్గాన్ని, వారి రాజ్యాంగ విధానాన్ని తొలగించి సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికి ఎక్కువ అవకాశం లభిస్తుంది. అందుచేతనే అలాంటి క్షీణదశలోగూడ యింకా కొంతకాలం వరకయినా తమ అధికారాన్ని నిలబెట్టుకోడానికి ఆ పాలక వర్గం ప్రజా సంరంభాలను అణచివేస్తూ ఫాసిజంను అవలం బించక వేరేమార్గంలేదు. ఫాసిజం ముఖ్యంగా యీ క్రింది లక్షణాలను గల్గియుంటుంది.

1. కార్మిక వర్గము, పీడిత ప్రజాసామాన్యము తమను దోపిడీచేసే వారితో జరిపే పోరాటాన్ని అణచివేయడం.

2. ఉత్పత్తిని హద్దులలో నడపడం, సాంకేతికంగా అభివృద్ధి చేయడం.

ని ఇతరదేశాలపై ఆధారపడకుండా వుండేటందుకు ప్రయత్నించును. అంటే ఫాసిజం యుద్ధానికి అనుకూలంగా వుండాలనే యుద్ధసన్నాహములను ఒకప్లాను ప్రకారం నడిపిస్తుంది. ఎందువల్లనంటే ఫాసిజానికి నెలకొల్పబడినదాని దశలో వాడు అనుభవించిన ఆర్థికక్షోభలనుండి బయటపడడం చేత గాక యెప్పటికీ ఆదుకొంటున్న క్షోభనే యింకా తీవ్రంగా పెంచుతుంది. అందువల్ల యీ ఆర్థికక్షోభలనుండి బయటపడాలంటే ఫాసిజానికి యుద్ధము తప్ప వేరేమార్గము లేదు. యుద్ధాలవల్ల యితరపోటీదారులను ఓడించవచ్చని, వారి మార్కెట్లను కాజేసి, ఆర్థికక్షోభనుండి బయటపడవచ్చునని తలంపుతో యుద్ధం ఆరంభించుతుంది.—

ఫ్రాన్సు సంపూర్ణ ప్రజాతంత్ర దేశమని, అచటి ప్రజాతంత్ర శక్తులు ఫాసిజం తమ దేశంలో స్థావరం ఏర్పరచుకోకుండా అడ్డుకోగల బలంకలిగి యున్నాయనీ, తలచుచున్న వారంతా ఫ్రాన్సులోని వాస్తవిక పరిస్థితులను పరిశీలించితే అచట ఫాసిజం బలపడడాన్ని గురించి ఆశ్చర్యపడ నవసరం లేదు. ముఖ్యంగా ఫ్రాన్సులో మధ్యతరగతి ప్రజలు ఎక్కువ. మొత్తం జనసంఖ్యలో మూడవ వంతుకుమించి రైతాంగ మున్నది.

బ్రిటనులో వ్యవసాయవృత్తికి చెందినటువంటి వారు అనగా భూస్వాములు, రైతులు, వ్యవసాయ కూలీలు, కవులు దార్లు, కలిసి బ్రిటను జనాభాలో 20 వ వంతు కే తక్కువతారు. దీనికితోడు ఫ్రాన్సులో చిన్నపరిశ్రమలు అనేకంగా వున్నాయి.

అందుకు నిదర్శనం యీ క్రింది లెక్కలు—

"ఫ్రాన్సులో 1926 సం॥లో వున్న 61,67,047 మొత్తం సంస్థలలో 59,83,075 సంస్థలు ఆయుధగుడు కాని యింకా తక్కువమంది శ్రామికులను

గల్గియున్నవి. అందులో 29,81,521 సంస్థలు ఒక్కొక్కరిని మాత్రమే గల్గియున్నవి. అంతేకాకుండా, అదేకాలంలో ఫ్రాన్సులో పనిగల్గియున్న వాళ్లసంఖ్య 1,78,00,000. అందులో అయిదుగురుగాని అంతకు తక్కువ గాని పనివారిని గల్గియున్న సంస్థలలో 1,18,00,000 మంది వున్నారు. పెద్దపెద్ద పరిశ్రమలలో అంటే 500 గాని యింకా ఎక్కువగాని పని వాండ్రను గల్గియున్న సంస్థలలో 15,00,000 మంది వున్నారు."

ఈ పై లెక్కలనుబట్టి వుద్యోగాలలో వున్నవారిలో కూడ అత్యధికభాగం మధ్యతరగతి క్రిందికే వస్తారు. వీటన్నిం టినీబట్టి ఫ్రాన్సు ప్రభుత్వం మధ్యతరగతి ప్రజల (పెటీ బూర్జువా) చే నిర్మింపబడియుందని అవగాహన అవుతుంది. ఈ చిన్న చిన్న పరిశ్రమలను, రైతులను దోచుకుంటూన్నది చాలభాగము గత అధ్యాయంలో వివరించబడిన ఆ 200 ల కుటుంబాలు మాత్రమే. ఫ్రాన్సుయొక్క ప్రజాస్వామిక మంతాగూడ వీరిగుప్పెళ్లలోనే యుంది. అమితమైనదగాకోరు తనంద్వారా సంపాదించిన డబ్బు అండతో యీ పాలకవర్గం, 'యీ రెండువందల కుటుంబాలు'—అధికారాన్ని చలా యిస్తూ వచ్చింది.

ఫ్రాన్సులో చట్టరీత్యాచూస్తే ప్రతిపౌరుడూ స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, పౌరసత్వ హక్కులు వున్నవాడుగానే కన్పించు తున్నాడు. అనుభవంలో మాత్రము యీ పౌరసత్వహక్కు లన్నీగూడ కొలదిమంది ధనాఢ్యుల ఆర్థికప్రాబల్యంవల్ల తుడు చుకుపోతున్నాయి. కాబట్టి అత్యాధికులగు ప్రజాసామాన్యం అందరియొక్క పౌరసత్వ హక్కులూ యీవిధంగా ఆర్థిక ప్రాబల్యంవల్ల తుడుచుకు పోతున్నాయని గ్రహించినప్పుడు

పరిస్థితులు విషాదాంతంగా మారుట సహజం. ప్రజాసామాన్యం యీ దగాను గ్రహించినప్పుడు పరిస్థితులు ఆయావర్గాలను బట్టి వివిధ రకాలుగా పరిణమిస్తుంటాయి. ఫ్రాన్సులో, సంఘటిత వర్గంలో అలాంటి మార్పువచ్చింది. కాని కొన్నిఏండ్ల వరకూగూడ వారు యీ తప్పుడు ప్రజాస్వామిక పద్ధతిని కూకటివేళ్లతో నాశనం గావించి నిజమైన పౌరసత్వహక్కులు స్వేచ్ఛ వుండేటటువంటి సోషలిస్టు సమాజాన్నే నిర్మించుకోవాలనే నిర్ణయానికి వచ్చారు. దానికొరకు యీపెట్టుబడిదారీ సమాజాన్ని రద్దుగావించాలను కున్నారు. దానితో పోరాడ డానికి తమతమ కార్మిక సంఘాలను, యితర రాచకీయ పార్టీలను ఏర్పరచుకొని బలపర్చుకోసాగారు.

ఆర్థిక ప్రాబల్యంవల్ల తమ పౌరసత్వ హక్కులన్నీ నాశనం గావించబడుతున్నా యన్నసంగతి మధ్యతరగతిప్రజలు (పెటీబూర్జువా) తెలుసుకున్నప్పుడు వారినిర్ణయము రెండు పంథాలుగా జరుగుటకు అవకాశాలున్నాయి. పాలకవర్గము ఎల్లప్పుడు తమ పత్రికలద్వారా యింకా తమ తమ వుపన్యాసాలద్వారా మధ్యతరగతి ప్రజలహక్కులు తాను యెల్లప్పుడు రక్షిస్తానని ఎడతెగని ప్రచారం గావించుతుంది. (ఇలాంటి ప్రచారము నేటికి బ్రిటిషు పత్రికలలో కన్పించుతుంది.)

ఈ ప్రచారానికి మోసపోయి పెటీబూర్జువా వర్గం నిజంగా తమకున్న కొలదిహక్కులు పాలితవర్గం రక్షించుచుతుందని యెంచి వారివైపుకు మ్రొగ్గవచ్చును. ఇక రెండవది. బూర్జువా ప్రజాతంత్రంయొక్క క్రుళ్లు క్రమేపీ (పాలకవర్గం

ప్రయోజనాలకు వ్యతిరేకంగా తమధనంయొక్క పలుకుబడిని విని యోగిస్తుంటారు గాన ఆ కుళ్ళు బయటపడుతుంది.) బయటబడి నప్పుడుయీ రెండవ నిర్ణయము జరుగవచ్చును. ఈనిర్ణయానికి వారు రాగల్గినప్పుడు వారంతా సంఘటిత పర్చబడి కార్మిక సంఘములతో చేతులు గల్పుతారు. ఎందుచేతనంటే కార్మిక వర్గ ఆశాయాలు, మధ్యతరగతి ప్రజల ఆశయాలు చాల వరకు ఒకటే అవడంజేసిన్నీ, బూర్జువా వర్గమునుండి తమ హక్కులను రక్షించుకోడంలో శ్రామికవర్గం తమకు తప్పక అండగా నిలుస్తుందని నమ్ముతారు గాబట్టిన్నీ యీ నిర్ణయము జరుగుతుంది. అయితే యిలాంటి నిర్ణయము కార్మికవర్గము బాగా సంఘటిత పర్చబడి, ఐక్యంగావుండి విప్లవనాయకత్వం గల్గియున్నప్పుడు మాత్రమే జరుగుతుంది. కార్మికవర్గం అలా లేనప్పుడు ప్రజాసామాన్యంలో అధిక భాగాన్ని తనచుట్టూ చేర్చుకోలేదు. అయితే ఫ్రాన్సులో యీ ధోరణి బాగా బలపడి పాప్యులరు ఫ్రంటు ప్రభుత్వం ఎలా యేర్పడింద్ తర్వాత చూద్దాం.

పెటీబూర్జువా వర్గం పై రెండూ కాకుండా మూడవ పంధాగూడ త్రొక్కుటకు అవకాశముంది. ఎందువల్లనంటే చట్టరీత్యా ఆధునిక శ్రామిక రాజ్యాంగంలోగల ప్రజాస్వామి కానికి, అనుభవంలో లక్షాధికారులు తమపై విధించే నిర్బంధ విధానానికి, వున్న తారతమ్యాన్ని గ్రహించినప్పుడు ప్రజా స్వామ్యం అన్నా, పార్లమెంటరీ పద్ధతులన్నా విరక్తి, ఎడ బాటుగల్గి మధ్యతరగతి ప్రజలు "ఓ భగవంతుడా మమ్ము

లను కాపాడు” అనే స్థితికి దిగజారుతారు. ఇలా దిగజారడం నిజంగా సోషలిస్టు సమాజాన్ని నిర్మించాలని ఉబలాట పడుతూన్న కార్మికోద్యమానికి విపత్తు మూలమవుతుందే గావచ్చు. కాని మధ్యతరకపు వర్గానికి రాజకీయ చైతన్యమూ లేదు. సోషలిస్టు చైతన్యం అసలేలేదు. సంఘటితపర్చబడిన వర్గమూ అంటే అదీగాదు. ఆవర్గాన్ని సంఘటిత పర్చడం సులభమూగాదు. అలాంటప్పుడు ‘దైవమా! నీదే భారం’ అన్నస్థితికి దిగజారడం ఆశ్చర్యకరమైన పనిగాదు. అలా దిగజారినప్పుడు వారు ప్రజాసామ్యమంటే దుమ్మెత్తిపోస్తూ తమ హక్కులు—వాటిని రక్షించుకునే మార్గాలు మాత్రమే వెదుకుకుంటారు. ఇలాంటిస్థితిలో యీవర్గము ఫాసిస్టు ప్రచారానికి మోసపోయి వారివలలో తగుల్కొంటుంది.

ప్రజాఐక్య సంఘటన (ప్యాపులర ఫ్రంటు) ప్రభుత్వం ఏర్పడకముందు ఫ్రాన్సులో కేవలం యింతే జరిగింది. మొదటి ప్రపంచయుద్ధము ముగిసిన పదిపండ్ల కాలంలో ఫ్రాన్సులోని పెటీబూర్జువా వర్గంలోని కొంతభాగం యిలాంటిస్థితికి దిగజారింది. ఈ సదవకాశాన్ని పోగొట్టుకోకుండా, ఆరెండు వందల కుటుంబాలు యీ ముఠాకు ఫాసిజం నూరిపోయడం ద్వారా యేవో వాగ్దానాలుచేసి వారిని లోబర్చుకుంటూ వచ్చారు.

అప్పటినుండీ ఫ్రాన్సులో ఫాసిస్టుసంఘాలు మొలకలెత్త సాగాయి. గత 7 ఏండ్లలోనూ యీ సంఘాలు బలంజేకూర్చు కుంటూ వస్తూన్నాయి. ఈ సంఘాలలో ఆక్షన్ ఫ్రాంకే;

క్రాయిక్సుడీఫో, జూనిస్ పాట్రియాట్, ఫ్రాంకైట్సు అనేవి ముఖ్యమైనవి. దాదాపు యీసంఘాలన్నింటికీ హిట్లరు ముస్సోలినీలతో సంబంధం వుంటూనేవచ్చింది. వాటిలో కొన్నింటికి ఇటలీ—జర్మనీలనుండి ఆర్థికసాయంగూడ లభిస్తుండేది. ఫ్రాంకైట్సు సంఘంవారు యీ విషయాన్ని దాపరికం లేకుండానే చెప్పివేశారు. మొదటి నుండేగూడ పీటైన్ ప్రభృతులు ఆక్షన్ ఫ్రాంకే అను సంఘానికి చాల సానుభూతి చూపుతుండేవారు.

## ఫ్రెంచి విదేశాంగనీతి.

ఈ శతాబ్దంయొక్క తొలి సంవత్సరాలలో బ్రిటను—జర్మనీలకు, జర్మనీ-రష్యాలకూ వున్న స్పర్థలనాధారం జేసికొని ఫ్రాన్సు రానున్న యుద్ధములో మిలటరీ విజయాలు పొందడానికి మిత్రరాజ్యాలను వెదుకనారంభించింది. ఆప్లాను ప్రకారమే యుద్ధానంతరము జరిగిన వర్సైల్సు సంధిలో గెలుపొందిన రాజ్యాలు జర్మనీని పూర్తిగా అణచివేయడానికి, యుద్ధఫలితంగా నూతనంగా జనించిన సోవియట్ యూనియనును నాశనంచేయడానికి వీలయేటట్లు మిత్రరాజ్యాల కూటమిని తయారుచేయ సాగాయి. కాని ఫ్రాన్సుదేశం రూర్ ప్రాంతాన్ని ఆక్రమించుకోడానికి అమెరికా బ్రిటనులు అంగీకరించకపోవడం జరిగిన తర్వాత ఫ్రాన్సు యిక తన యిచ్ఛ వచ్చిన మార్గాన్ని పోజాలక బ్రిటను చెప్పుచేతలలో నడువవలసివచ్చింది. 1938 లో జరిగిన మ్యూనిక్ వ్యవహారము పై విషయాన్ని ఋజువుచేస్తుంది. కాని బ్రిటను పలుకుబడినుండి

బయటబడి తన యిచ్ఛవచ్చినమార్గాన్ని పోడానికి అప్పుడప్పుడు ఫ్రాన్సు ప్రయత్నిస్తూనేవచ్చింది. బ్రిటను పలుకుబడి నుండి బయటబడడం అంటే తప్పక జర్మనీకి లొంగిపోవాలి. ఎందు చేతనంటే భౌతికరూపేణాచూస్తే జర్మనీయొక్క బలము పూర్వపు బలమంత దాదాపుగావుంది. ఫ్రాన్సుతో పోల్చి చూస్తే ఎక్కువ బలంగావుంది. 1929 లోనూ, తర్వాతనూ గూడ జర్మనీ ఫ్రాన్సు విదేశాంగ మంత్రుల సంభాషణలు జరిగాయి. రైన్ లాండు బొగ్గుగనుల యజమానులు, ఫ్రెంచిలో రైన్ యినుము, బొగ్గుగనుల యజమానులును, అంతర్జాతీయ ఉక్కు పరిశ్రమలను గూర్చి ఒక ఒడంబడికకురా ప్రయత్నించారు. ఈ సందర్భాలలో ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. అభివృద్ధి నిరోధక శక్తులకు వ్యతిరేకంగా జర్మను శ్రామిక వర్గాన్ని, ప్రజా సామాన్యాన్ని బలపర్చుటకు మారుగా ఫ్రెంచి ప్రభుత్వం జర్మను ఫాసిస్టుపాలకవర్గాన్నే బలపర్చుతూ వచ్చింది. జర్మనీలో హిట్లరు నియంతృత్వం ఏర్పడిన తొలి దినాల్లో యీ బలపర్చడం తగ్గినా, రానురాను జర్మను ప్రభుత్వాన్ని ఎక్కువగా బలపర్చింది. లోగడ యే జర్మను ప్రభుత్వానికిగూడ యీయ నిరాకరించిన సౌకర్యాలను గూడ హిట్లరు ప్రభుత్వానికి యీయసాగింది.

1934 నుండి యితర ఫాసిస్టు ముఠాలవలెనే ఫ్రెంచి ఫాసిస్టు ముఠాగూడ ఫ్రెంచి సోవియట్ పరస్పర సహాయపు టొడంబడికను భగ్నం చేయడానికి ప్రయత్నిస్తూ వచ్చింది. ఈ తమ ప్రయత్నాలకు కొలది ఆటంకంగా తోచినట్టి యుగో

స్లేవియా చక్రవర్తియగు అలెగ్జాండరును, ఫ్రాన్సు విదేశాంగ మంత్రియగు బార్తోను, యీ ఫాసిస్టు ముఠా (ఇటలీ, జర్మనీల పలుకుబడి క్రిందవున్న ముఠా) హత్యగావించింది. ఫ్రాన్సు విదేశాంగ నీతిలో ఫాసిస్టుల కనుకూల ప్రయత్నాలు స్వామి ద్రోహియగు సోషలిస్టు లావల్ ప్రధానిగావున్న కాలంలో తీవ్రతర మయ్యాయి. ఫ్రాంకో సోవియట్ పరస్పర సహాయపు టొడంబడికను ఫ్రెంచి పార్లమెంటుచే ఆమోదింప చేయుటకు యితడు నెలల పర్యంతమూ వాయిదావేస్తూ వచ్చాడు. 1935 లో ముస్సోలినీ అభిసీనియాపై యుద్ధానికి బహిరంగంగానే సన్నాహాలు చేస్తున్న సమయంలో ఈ లావలు—ముస్సోలినీ, రామ్సే మాక్డొనాల్డు, సర్ జాన్ సైమన్‌లతో--స్ట్రెసా కాన్ఫరెన్సును సమావేశపర్చాడు. ఆ సమావేశంలో అన్ని విషయాలపైనా చర్చలు జరిగాయి గాని అసలు విషయమయి నటువంటి అబిసీనియానుగూర్చి యెవ్వరూ నోరువిప్పలేదు. అంతే గాకుండా ఆ సమావేశంలో లావలు ముస్సోలినీతో ఒక రహస్య ఒడంబడిక గావించుకున్నాడు. బ్రిటను విదేశాంగ మంత్రి హోర్, ఫ్రెంచి ప్రధాని లావలుగలసి అబిసీనియాలో చాలభాగం ఇటలీకి యీయడానికి ఒక ఒడంబడికను తయారుచేశారు. ఆ ఒడంబడికకుగూడ ఇటలీ సంతృప్తి జెందలేదు. మీదుమిక్కిలి యీ కుట్రల ఫలితంగా బ్రిటనులోనూ ఫ్రాన్సులోనూగూడ ప్రజాసామాన్యం చాల అలజడి, ఆందోళన గావించడంవల్ల బ్రిటనులో హోర్‌ను మంత్రిపదవి నుండి

తొలగించారు. 1936 జనవరి నెలలో లావలుగూడ ఫ్రెంచి ప్రధానామాత్య పదవినుండి తొలగించబడ్డాడు.

## ఫ్రెంచి విదేశాంగనీతిలో ఫాసిజం బలపడ్డ 3-వ దశ

ఈ దశలో చాలవరకు ఫ్రాన్సు బ్రిటనుకొక్క ఏజంటుగా పనిచేసిందనవచ్చును. 1936 మార్చి 7వ తేది హిట్లరు రైన్‌లాండులో తన సైన్యాన్ని దించాడు. ఫ్రెంచి శాసనసభలకు ఎన్నికలు జరిగే దినాలు అవి. అదివరకే హిట్లరు వర్సెల్సు సంధియొక్క షరతుల నన్నింటినీ ఒకదానివెనుక మరియొక దానిని బుట్టదాఖలు చేస్తూవచ్చాడు. తాను తన విమానాధిక్యతనూ పెంచాడు. అనేక ప్రజాసంఘాల పేరిట జర్మనీలో మిలటరీ శిక్షణను యియ్యసాగాడు. బ్రిటను అనుమతితోనే తన నౌకాదళాన్ని గూడ అధికం జేసుకున్నాడు. హిట్లరు రైన్‌లాండులో తన సైన్యాని దించినప్పుడు ఫ్రెంచి ప్రభుత్వం తన సైన్యాన్ని సంఘటితపరచి హిట్లరును ఎదుర్కోడానికి సన్నాహాలు చేయలేదు. అలా చేసియున్నట్లయితే గత్యంతరం లేక బ్రిటను ఫ్రాన్సును బలపర్చవలవచ్చేది. దానితో హిట్లరు సైన్యాలు బయలుదేరిన తావుకు మరలిపోవలసి వచ్చేది. కాని ఫ్రెంచి ప్రధాని ఫ్లాండిన్ అలాచెయ్యక లండనుకు పరుగెత్తి వారి సలహాకోసం ప్రాధేయపడ్డాడు. జర్మనీ బలపడడాన్ని లోలోన కాంక్షించే ఆ లండను మిత్రులు ఫ్రాన్సు జర్మనీని ఎదుర్కోడానికి వ్యతిరేకించి తామే దానికి తగిన చర్య తీసుకుంటామని చెప్పి బుజ్జగించి తిరిగి ఫ్లాడిన్ను యింటికి సాగనంపారు. అప్పటి బ్రిటిషు విదేశాంగ మంత్రియగు ఈడెన్

హిట్లరుకు, సమాధానాలు పంపించవలసిందిగా ఏవోవో ప్రశ్నల కట్ట పంపించాడు. హిట్లరు యీ ప్రశ్నావళికి సమాధానాలు గూడ యీయక తుడిచి పారవేశాడు. వీటన్నింటి ఫలితంగా ఫ్రాన్స్‌లో అభివృద్ధి నిరోధక మతాలలో చాల మంది నాజీ అనుకూలవైఖరిని అవలంబించుతూ వచ్చారు.

## స్పెయినుపట్ల ఫ్రాన్స్ వైఖరి.

స్పెయిన్ ప్రజాస్వామిక ప్రభుత్వము 1936 జూలైలో ఫాసిస్టు ద్రోహులచే యెదురొక్క బడినప్పుడు బ్రిటను ఫ్రాన్స్‌లు ఫాసిస్టు అనుకూల వైఖరియగు తటస్తతా విధానాన్ని అవలంభించుటచే ఫ్రాంకో విజయంపొంది స్పెయిన్ ప్రజాస్వామికం బ్రద్దలుచేయబడింది. తర్వాత 1938 ఘటనలు, అంటే ఆస్ట్రియాను, జెకోస్లోవేకియానూ, హిట్లరుకు అప్పజెప్పడం, మ్యూనిక్ ఒడంబడికతో ఫ్రెంచి సోవియట్ పరస్పర సహాయపు టొడంబడికగూడ రద్దయింది.

ఫ్రాన్స్‌యొక్క విదేశాంగ నీతిలో ఫాసిస్టు ధోరణ హెచ్చుపెరగడానికి కారణం యిది. మొదటనుండీ గూడ ఫ్రెంచి పాలకవరానికి, దినదినానికి బలపడుతూన్న సోవియట్ యూనియన్‌ను ఆదర్శంగాపెట్టికొని తమదేశంలో అప్పటికేవర్గ పోరాటం విజృంభింపచేస్తున్న కార్మికులు విప్లవం తీసికువస్తారేమో అనే భయం తాండవమాడుచుండేది.

తర్వాత అధ్యాయంలో ఫ్రెంచి ఫాసిస్టులు దౌర్జన్యంగా అధికారం లాక్కోవాలని ప్రయత్నించడం, దానితో ప్రజా ఐక్యసంఘటన ఏర్పడినవిధానము పరిశీలిద్దాం.

# 4. వివిధ వర్గాలమధ్య స్పర్ధలు విజృంభించుట

1929 ఆర్థిక క్షోభఫలితంగా ఫ్రాన్సులో నిరుద్యోగం మితిమీరడం, కార్మికుల వేతనాలు పూర్తిగా కోసివేయబడడంవల్ల కార్మికులలో అలజడి, చైతన్యము పెరిగిపోయింది. ఇక రైతాంగం (ముఖ్యంగా ద్రాక్ష పండించేరైతులు), వ్యవసాయ కూలీలుగూడ అతివాద దృక్పథానికి మొగ్గజొచ్చాయి. దీని ఫలితంగా 1932 మే నుండి యిరువదినెలల తదనంతరం వరకూగూడ అనేక రాడికలు సోషలిస్టుపార్టీలు అధికారంలోనికి వచ్చాయి. కాని యీ ప్రభుత్వాలన్నీగూడ తమ విదేశాంగ నీతిలో లండనుమీదా, స్వదేశ వ్యవహారాలలో ఫ్రెంచి లక్షాధికారులమీదా ఆధారపడక తప్పిందిగాదు.

ఫ్రాన్సులోని పార్లమెంటరీ విధానావాన్ని రద్దుగావించి ఫాసిస్టు ప్రభుత్వాన్ని ఏర్పరచడానికి ఫ్రెంచి ఫాసిస్టులు కుట్రలు, దౌర్జన్య పద్ధతులు అవలంబింప సాగారు. కొందరు ఏజంట్లచే దోపిడీలు, మోసకృత్యాలు చేయించి ఆతప్పులన్నీ పార్లమెంటుపై రుద్దజూచారు. 1934 ఫిబ్రవరి 6 వ తేదీన ఫ్రెంచి ఫాసిస్టులు పార్లమెంటు భవనం మీదకు దాడివెడలారు. "దొంగలు అంతరించాలి! దలాదీరు ప్రభుత్వము

నశించాలి! ప్రభుత్వము రాజీనామా పెట్టాలి! ఛాప్ (ఇతడు ఫాసిస్టు) మంత్రివర్గమే రావాలి" అనే నినాదాలతో అల్లరి ప్రారంభించారు. ఫాసిస్టులకు ప్రభుత్వానికి మధ్య పోరాటం ఆరంభమయింది. పార్లమెంటు భవనాలవద్ద హృదయం 5 గం టలనుండి రాత్రివరకూగూడ ప్రభుత్వానికి ఫాసిస్టు ముఠాకు గలాటా జరుగుతూనే యుంది. ఈఫాసిస్టులు రాళ్లువిసరడం, వెళ్లిపోయే గుర్రాలను మనుష్యులను బ్లేడులతో గాయపర చడం, వచ్చేపోయే కార్లను బోల్తాలుగొట్టించి వాటికి నిప్పం టించడం మొదలగు దురంతరాలు చేయసాగారు. ఈ కర్మ కాండ అంతా నాజీల ప్రోత్సాహంవల్లనే జరిగింది. ఈ ఫాసిస్టు దౌర్జన్యాన్ని ఎదుర్కోలేక దలాదీరు ప్రభుత్వం రాజీనామాయిచ్చి బయటకు వచ్చింది. ఈదుండగీంద్రులు తమ కనుకూలమయిన ప్రభుత్వాన్ని యేర్పరచారు.

ఈవిషమ పరిస్థితులు, యీ దుండగీడుతనాలు ఫ్రెంచి కార్మికవర్గాన్ని, ప్రజాసామాన్యాన్ని కలత పరచింది. ఫ్రెంచి కార్మికులు ఫ్రాన్సులో ఫాసిజానికి తావులేకుండా చేయాలనే దృఢ నిశ్చయానికి వచ్చారు. ఫిబ్రవరి 12 వ తేదీని సర్వవ్యాపిత సమ్మెచేయాలని తీర్మానించుకున్నారు. ఈ సమ్మెను బలపర్చుటకు, అందులో పాల్గొనుటకూ గూడ తీర్మానించుకొన్న ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ ఫిబ్రవరి 9 వ తేదీని ఒక ప్రదర్శనం గావించింది. ఈ ప్రదర్శనాన్ని అటకా యించడానికి వచ్చిన ప్రభుత్వ పోలీసులకూ కమ్యూనిస్టు కార్మికులకు ఘర్షణజరిగింది. దానిఫలితంగా ఆర్గురు కార్మి

కులు మరణించారు, కొన్నివందల మంది గాయపడ్డారు. 1200 మంది అరెస్టుచేయబడ్డారు. ఆ మరుసటి రోజునే— ఫిబ్రవరి 10 వ తేదీని—ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ యీ క్రింది ప్రణాళికను తయారుచేసి ప్రచారం గావించింది.

"కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంక్రింద పారిస్ నగరశివార్లలో పారిస్ నగర కార్మికులు చరిత్రాత్మకమైన ప్రదర్శనం జరిపారు. వేలకొలది సోషలిస్టు కార్మికులు యీ ప్రదర్శనంలో పాల్గొన్నారు. దీనినిబట్టి బాగా సంఘటించబడిన ఫ్రెంచి కార్మికవర్గం ఫాసిజంను రూపుమాపడానికి కంకణం గట్టుకున్నదని అర్థమవుతూంది. ఐక్యసంఘటనవల్ల జరిగిన యీ పోరాటం బూర్జువావర్గాన్ని భయభ్రాంతుల జేసింది. నిన్నటి ఘటనలను తదితర ఫ్యాక్టరీలలోని కార్మికులుగూడ నేడు తెలుసుకుంటారు. వారి వారి కార్మాగారాలలో సమావేశమవుతారు. కమ్యూనిస్టులు, సోషలిస్టులు కార్మిక సంఘాలు, తరితరసంఘాలవారు అందరూగూడ తమ ఏకైక శత్రువును ఎదుర్కొడానికి వారి వారి ఐక్యసంఘటనా కమిటీలను ఎన్నుకుంటారు. సోమవారం 12 వ తేదీని సర్వవ్యాపిత సమ్మె, ప్రదర్శనాలు ద్వారా ఫాసిజానికి ఫ్రాన్స్‌లో తావులేకుండా చేస్తారు. దానియొక్క ఓటమి ఫ్రెంచి కార్మికవర్గంమీద, దానికి పురోగామి—నాయకురాలు అయిన ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీయొక్క విప్లవనాయకత్వంమీద ఆధారపడియుంది."

అదేప్రకారం ఫిబ్రవరి 12వ తేదీని బ్రహ్మాండమయిన సర్వవ్యాపిత సమ్మెజరిగింది. 45,00,900 కార్మికులు మిల్లులనుండి బయటికివచ్చివేశారు. ఊరేగింపులలో 10,00,000 మంది కార్మికులు పాల్గొన్నారు. కమ్యూనిస్టులకు, సోషలిస్టులకూ చెందిన కార్మికవర్గంలోని రెండు ముఠాలవారూ పాల్గొన్నారు. పోస్టు జవానులు, బడిపంతుళ్లు, ప్రభుత్వోద్యోగులలో ఎక్కువభాగంగూడ యీ సమ్మెలో పాల్గొ

న్నారు. ఒక్క పారిస్ నగరంలోనే 1,80,000 కార్మికులు పాల్గొన్నారు. తద్వారా యీ ప్రదర్శనాలలో పాల్గొన్న వారిలోగాక ఫ్రెంచి కార్మికవర్గ మందరిలోనూగూడ ఫాసీజాన్ని ఎదుర్కోడానికి తమకున్న బలము, ధైర్యము, నమ్మకము వెల్లడి అయింది. అంతకంటె ముఖ్యమయిన ఘటన యింకొకటి జరిగింది. అంతవరకూ కమ్యూనిస్టు కార్మికులనీ, సోషలిస్టు కార్మికులనీ రెండుముఠాలుగా విడబడిపోయి బలహీనంగా వున్న ఫ్రెంచి కార్మికవర్గం యిప్పుడు ఐక్యమై సంయుక్త ప్రతిఘటనా కమిటీలను ఫ్రాన్సనందంతటా ఏర్పరచింది. అప్పటినుండి ఫాసిస్టులకు వ్యతిరేకంగా తర్వాత నాల్గునెలలలో 22 కార్మిక ప్రదర్శనాలు, 930 బహిరంగ సభలు జరిగాయి. ప్రజాసంయుక్త సంఘటనను ఏర్పరచాలని కమ్యూనిస్టులు తీవ్రప్రయత్నం చేశారు.

జర్మనీలో హిట్లరు అధికారానికి రావడం, జర్మనీలోని కార్మికసంఘాలను, యితరసంఘాలను అణచివేయడం జరిగిన తర్వాత, యూరపునందంతటా ప్రజాసంయుక్త సంఘటనలను యేర్పరచడానికి ప్రయత్నాలు జరిగాయి. కాని రెండవ అంతర్జాతీయ సభకు శాఖలు, బ్రిటిషు లేబరుపార్టీ నాయకత్వాన యీ నినాదానికి పూర్తివ్యతిరేకంగా పనిచేశాయి. వాటిలో ఫ్రెంచి సోషలిస్టు పార్టీగూడ ఒకటి.

ఈ సమ్మెలు, ప్రదర్శనాలు ఫ్రాన్సును కదలించివేశాయి. ప్రజాసామాన్యమంతా సంయుక్త సంఘటన వైపుకు మ్రొగ్గజొచ్చారు. సోషలిస్టులుగూడ కమ్యూనిస్టు

లతో గలసి ఐక్యసంఘటనకు అంగీకరించారు. థాల్‌మెన్ (జర్మను కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి)ను విడుదల గావించా లని తీవ్ర ఆందోళనజేశారు. 1934 జూలై 27 వ తేదీని ఫ్రెంచి కమ్యూనిస్టులకు—సోషలిస్టులకు ఒక ఒడంబడిక జరి గింది. ఈవిధంగా 1935 వేసవిలో 'ఐక్యసంఘటన' యేర్ప డింది. దీనిద్వారా ఫ్రెంచి కార్మికవర్గంయొక్క బలం అధిక మయింది. ఇంకొక వైపు కార్మికవర్గానికి, అప్పటికే భయ భ్రాంతులగుచున్న ఫ్రెంచి పాలకవర్గానికి మధ్య కార్చిచ్చురే గింది.



దేశద్రోహి లావల్



మారిస్ థోరే

ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి. ఫ్రాన్సు పతనానికి ముందు, ఫ్రెంచిప్రభుత్వం పారిస్‌నగరాన్ని విడచి పరుగెత్తినరోజుల్లో, ఫ్రెంచి ధనికవర్గం యితను పారిస్‌నగరంలో నొక కమ్యూన్‌ను స్థాపించినట్లు ఆరోపించింది. కానీ, అది అబద్ధమని తేలింది. థోరే జర్మనీకి పరుగెత్తిపోయాడని మరోవదంతి వ్యాపించింది. జర్మను నాజీలకు లొంగవద్దని ఫ్రాన్సులోని ఒకరహస్య బ్రాడ్ కాస్టు కేంద్రంనుండి యితను శ్రామికవర్గానికంతటికీ వర్తమానాలంపాడు. ప్రజాఐక్యసంఘటనకొరకు పోరాడినవారిలో ముఖ్యుడు.

# 5. ప్రజాఐక్య సంఘటన

'ప్రజాఐక్య సంఘటన' (పాపులరుఫ్రంటు) నినా దాన్ని ప్రారంభించింది మొదట కమ్యూనిస్టుపార్టీ. ఫ్రాన్సు లోని వినాశకరమైన ఫాసిస్టు శక్తులన్నీ గుమికూడి ప్రజా సామాన్యాన్ని అమితంగా దోచుకుంటూన్న దినాలలో ఆ రెండువందల కుటుంబాలకు వ్యతిరేకంగా ప్రజాఐక్య సంఘ టన ఏర్పడడానికి 1934 జూలైలో ఏర్పడిన కార్మిక ఐక్య సంఘటన దారి చూపింది.

1934 అక్టోబరులో జరిగిన ఫ్రెంచి రాడికలు సోష లిస్టుపార్టీ సమావేశంలో ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి యగు మారిస్‌థోరే ప్రజాఐక్య సంఘటనను గూర్చి గంభీరో పన్యాసం గావించాడు. మొదట రాడికలుపార్టీవారు దానికి అంగీకరించలేదుగాని రానురాను అనేక సభలద్వారా ప్రచా రము, ఆందోళన గావించిన ఫలితంగా ప్రజాఐక్య సంఘటన నినాదము ప్రజావుద్యమంగా పరిణమించింది. 1907 లో స్థాపింపబడిన 'మానవుని హక్కులసంఘము' గూడ పాప్యు లరు ఫ్రంటు నినాధానికి తన 1,80,000 మంది సభ్యులను అండగా తెచ్చింది. 1936 ఫిబ్రవరి 10 తేదీని కమ్యూనిస్టులు, సోషలిస్టులు గలసి 1,00,000 కార్మికులను పార్లమెంటు భవనంవద్దకు గత ఏడాది, ఫాసిజంతో పోరాడి మరణించిన

కార్మికుల గౌరవార్థము ప్రదర్శనం తీసుకెళ్లారు. వీటన్నింటినిబట్టి ఫ్రాన్స్‌లో పాప్యులరు ఫ్రంటు ప్రభుత్వాన్ని ఏర్పరచుటకు అనుకూల వాతావరణం ఏర్పడిందని అవగాహనవుతుంది.

జూలై 14 వ తేదీ ఫ్రెంచి ప్రభుత్వానికి పండుగ దినము. ఈ ఏడాది ఆపండుగను 200 కుటుంబాలకు వ్యతిరేకంగా ప్రజాప్రదర్శనాలతో జరుపాలని నిర్ణయించ బడింది. ఆ ప్రకారమే 1935 జూలై 14 న విప్లవ సైతన్యంగల సంఘాల తరఫున వేయిమంది ప్రతినిధులు, 5,00,000 ఫ్రెంచి స్త్రీ పురుషులు వెంటరాగా పారిసులోని బాస్టిలిని నుండి బ్రహ్మాండమయిన ప్రజాప్రదర్శనం జరిగింది. ఆ ప్రదర్శనానంతరం వారంతా ఫ్రెంచి ప్రజాస్వామ్యాన్ని చిరస్థాయిగా చేస్తామనీ, ఫాసిస్టు సంఘాలను నాశనంగావించి ఫ్రెంచిప్రజలచే సాధించబడిన పౌరసత్వహక్కులు, కూలీలకుతిండి, అందరికీ పని, మానవశాంతి—అభ్యుద యాలను కాపాడడానికి తామంతా ఐక్యంగా వుంటామని శపథం తీసుకున్నారు. ఆ విధంగా జూలై 14 వ తేదీ చరిత్రాత్మక దినమయింది.

ఆ కాలంలో అధికారంలోవున్న లావల్ ప్రభుత్వానికి ఫ్రెంచి ఛాంబరులోని కొన్నిపార్టీలు వ్యతిరేక కూటమిని ఏర్పరుచుకో సాగాయి. అదేసమయంలో ఫ్రాన్స్‌లోగల రాడికలు పార్టీలు, సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీలుగలసి పాప్యులరుఫ్రంటు ప్రణాళికను తయారుజేసి 1936 జనవరి 11 న ప్రకటించినవి. ఈ ప్రణాళికను పది సంఘాలవారుగలసి

తయారు చేసారు. అందులో సోషలిస్టు కార్మిక సంఘాలవారు కమ్యూనిస్టు కార్మిక సంఘాలవారు ముఖ్యులు.

ఆ ప్రణాళిక (1) కనీస రాజకీయకోర్కెలు, (2) కనీస ఆర్థిక కోర్కెలు అని రెండు భాగాలుగా తయారు చేయ బడింది. ముఖ్యంగా యీ ప్రణాళిక ఆ రెండువందల కుటుంబాలకు, వారికి సంబంధించిన ఫాసిస్టు సంఘాలకు, ఆయుధ కార్మాగారాలవారికి పూర్తి వ్యతిరేకంగా తయారుచేయ బడింది. ఇంకా లావలు ప్రభుత్వం విధించిన ఆర్థిక సూత్రాలను రద్దుచేయుటకు, రైతులు పండించే వస్తువుల ధరలకు కనీసధరలను నిర్ణయించడానికి, కార్మిక సంఘాలకు పూర్తి స్వేచ్ఛ, వారంలో తక్కువ గంటలపని, ప్రజాసామాన్యానికంతటికీ నిజమైన పౌరసత్వ హక్కులకు ఆ ప్రణాళిక అనుకూలంగా తయారు చేయబడింది. ఇంకా యీ ప్రణాళిక ప్రజాసామాన్యంచే ఎన్నుకోబడిన పాప్యులరు ఫ్రంటు కమిటీలచే, సోషలిస్టు, కమ్యూనిస్టు నినాదమైన ఐక్య సంఘటనా సూత్రంపై ఆధారపడి, తయారు చేయబడింది. ఇందులో ఫాసీజం, అభివృద్ధి నిరోధకం, యుద్ధము మొదలగు శక్తుల క్రింద నలిగిపోయే ప్రజాసామాన్యంయొక్క హక్కులన్నీ చక్కగా నిరూపించ బడినాయి. ఇది ఫ్రెంచి, ప్రణాళికే అయినప్పటికి ప్రపంచ ప్రజాసామాన్యానికే అనువర్తించేలా తయారు చేయబడింది. అదేకాలంలో స్పెయినులోనూ, చైనా ఇండియాలలోనూ కూడ ప్రజాశక్తులన్నీ ఏకమై పాప్యులరు ఫ్రంటు నిర్మాణానికి అనుకూలంగా తమ తమ కార్యక్రమా

బను మార్చుకుంటున్నాయి. ఒక్క మాటలో, ఆకాలంలో మానవజాతిలో అత్యధిక భాగము తాము న్న పరిస్థితులను అర్థంజేసుకొని ఫాసిస్టు వాతావరణంనుండి బయటబడడానికి ఒక నూతన వుద్యమం స్థాపించిందని చెప్పవచ్చు. శాస్త్రీయ సోషలిస్టు సిద్ధాంత స్థాపకులగు మార్క్సు, ఏంగిల్సులు కార్మికులు తామొక ప్రత్యేకవర్గంగా భావించుకోవాలనీ పదేపదే చెప్పినా, ప్రత్యేక పరిస్థితులలో కార్మికులు, మధ్యతరగతి ప్రజలు తమ శత్రువును ఎదుర్కోడానికి తామిద్దరూ గలసి ఒకే కార్యక్రమాన్ని నిర్ణయించు కొనుటకు అవకాశాలు ఏర్పడుతాయి అనికూడ ఎలుగెత్తి చాటారు. ఈ విషయాన్ని ఐరోపా దేశాలలోని లేబరుపార్టీల, సోషలిస్టుపార్టీల నాయకులు గ్రహించక తాముగూడ ఫాసిస్టులతో ఏకమై పాప్యులరు ఫ్రంటుకు వ్యతిరేకించ సాగారు. (ఫ్రాన్సులోనూ, స్పెయినులోనూ యీ వ్యతిరేకత చాలవరకు నశించి కార్మిక నాయకులు పాప్యులరుఫ్రంటు వైపుకు మొగ్గారు.)

పాప్యులరు ఫ్రంటుకు వ్యతిరేకించిన వారిలో సోషల్ డెమాక్రెట్లు ముఖ్యులు. ఫ్రాన్సులోని పాప్యులరు ఫ్రంటు వుద్యమంయొక్క విశేషమేమంటే యీ బలహీనత నశించి ఫాసిజాన్ని ఎదిరించడానికి కార్మికవర్గం మధ్యతరగతి ప్రజలను తనవైపుకు లాక్కోగల్గడమే. దీనిఫలితంగా 1935 లో సోషలిస్టు, కమ్యూనిస్టు కార్మికసంఘాల మొత్తం సభ్యత్వం ఒక 10,00,000 (ఆరులక్షల సోషలిస్టు కార్మికులు. నాలుగులక్షల కమ్యూనిస్టు కార్మికులు) వుంటే 1936 లో ఆసభ్యత్వము

50,00,000 కు పెరిగింది. ఏ పెట్టుబడిదారీ దేశంలోగూడ కార్మికోద్యమం యింత సభ్యత్వాన్ని గల్గియుండలేదు.

మొదటి అధ్యాయంలోనే చెప్పినట్లు ఫ్రాన్స్‌లో క్రమం తప్పకుండా నాల్గేండ్లకొక పర్యాయం ఎన్నికలు జరుగుతాయి. 1936 ఏప్రిలు, మే నెలలో జరిగిన ఎన్నికలు కార్మికులలో చీలికలు నశించి, పాప్యులరు ఫ్రంటు వుద్యమంమంచి వుచ్ఛ దశలోవున్న దినాలలో జరిగాయి. ఆ ఎన్నికలలో 618 మొత్తం స్థానాలకు 378 స్థానాలు పాప్యులరు ఫ్రంటుకు వచ్చినాయి. లియన్ బ్లమ్ (ఫ్రెంచి సోషలిస్టు నాయకుడు) నాయకత్వాన పాప్యులరు ఫ్రంటు ప్రభుత్వం ఏర్పడింది. ఈ క్రొత్త ప్రభుత్వము యింకా శాసనసభా కార్యక్రమాన్ని నిర్ణయించకమునుపే ఫ్రాన్స్‌లో మరలా కార్మికసమ్మెలు చెలరేగినాయి. 1930-35 మధ్య వేతనాలు 30% తగ్గించ బడినాయి. 1935 తర్వాత లావలు ప్రభుత్వం యింకా తగ్గించింది. కార్మికులు అలాంటిస్థితినుండి బయటబడడానికి మంచి అదునుకై అంతవరకూ నిరీక్షిస్తూవచ్చారు. పోగొట్టుకోబడిన తమ వేతనాల పాప్యులరు ఫ్రంటు ప్రభుత్వంలోనైనాను తిరిగి పెంపుదల చేయించుకోడానికి సమ్మెలు ఆరంభించారు. 1936 జూలై మొదటివారంలో పారిస్‌లో సమ్మెలు ఆరంభమయి 10,00,000 కార్మికులు వాటిలో పాల్గొన్నారు. ఈ సమ్మెలు దేశమంతటా వ్యాపించుతున్నాయి. ఆ సమ్మెలలో అనేక తరగతులకు చెందినవారు—మోటారుపనివాండ్రు, విమాన యంత్రాగారాల పనివారు, గనులపనివారు, బట్టల

యంత్రాల కార్మికులు, అచ్చుపనివారు, కాగితపరిశ్రమ, సిమెంటు పరిశ్రమ, నూనె యంత్రాలు, డిస్టిలర్లు మొదలుగాగల యంత్రాలయాల కార్మికులు, బిల్డింగు బ్రాంచివారు, తినుబండారాలు తయారుచేసే కార్మికులు, డ్రైవర్లు, దుకాణాలలోని గుమాస్తాలు యింకా అనేక తరగతులకు చెందిన కార్మికులు పాల్గొన్నారు. ఆ సమ్మెలన్నీ పరిశ్రమాలయాల లోపలగూర్చుండి పనిమానివేసిన సమ్మెలే. ఇటువంటిసమ్మెలు 1920 లో ఇటలీలో మినహా అంతవరకు ప్రపంచంలో మరి యెచ్చటనూ జరుగలేదు. కార్మికులు పనిమానివేశి యంత్రాలయాలలోనే కూర్చుండేవారు. రాత్రులందుగూడ బయటకు వచ్చేవారుగారు. ఫాక్టరీ కమిటీలను ఏర్పరచుకున్నారు. భోజన సదుపాయాలకుగూడ తగిన ఏర్పాటు గావించుకున్నారు. అన్నియేర్పాట్లు చాల కట్టుదిట్టెంగానూ, క్రమశిక్షణతోనూ గూడియున్నాయి. కాని పనులుమాత్రమే మాని వేశారు.

ఈ సమ్మెలమూలంగా యజమానులు చాల నిస్సహాయస్థితిలో పడిపోయారు. తర్వాత ఋజువయినట్లు యీ సమ్మెలవిషయంలో రాడికలు పార్టీలలో కొందరు యీ సమ్మెలలో పాల్గొన్న కార్మికులను తుపాకీగుండ్లతో ఫాక్టరీల నుండి బయటకు గెంటివేయవలసిన విధి ప్రభుత్వంపై వున్నదని ఒత్తిడిచేశారు. కాని అప్పుడే ఏర్పడిన నూతన ప్రభుత్వం యీ నిర్ణయానికి రావడానికి కలలోగూడ సాహసించలేక పోయింది. అలాంటి నిర్ణయానికి రావడంలోగల మంచిచెడు

గులు యజమానులకూ తెలుసు—అంతకంటె మిన్నగా కార్మి కులకూ తెలుసు. తెలిసే మంచి అదునులో సమ్మెలు ప్రారంభించారు.

సమ్మెలను భగ్నపరచే పిరికిపందలు ఎవ్వరూ కార్మికు లలో గన్పించని కారణంచేత యజమానులు లొంగిపోయారు. జూలై 7వ తేదీని యజమానులకు, కార్మికులకూ ఫ్రెంచి ప్రధాని బ్లమ్ అధ్వర్యాన ఒక ఒడంబడిక గుదిరింది. ఆ ఒడం బడికలో యజమానులు యీ క్రింది కార్మిక కోర్కెలకు అంగీకరించారు.

(1) జీతంలో ఏవిధంగానూ కోత లేకుండా 40 గంటలపని వారమునకు.

(2) ఏడాదికి జీతముమీాద 14 దినాలు శెలవు.

(3) సూపరువైజు చేసేందుకుగాను కార్మికులు కమిటీలను ఎన్ను కోవచ్చు.

(4) లావలు విధించిన వేతనాల కోతను రద్దుచేయడం ఆ కోర్కె లలో ముఖ్యమైనవి.

ఈ ఒడంబడిక గుదిరిన యింకా కొలది దినాలవరకూ గూడ సమ్మెలు జరుగుతూనే వచ్చాయి. అప్పటి పరిస్తితు లను బాగా అవగాహనజేసికొని యిక సమ్మెలు ఆపివేయవల సిందని ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి మారిస్ థోరే ప్రకటించిన తదుపరిమాత్రమే ఆసమ్మెలు ఆపివేయబడినాయి. ఒడంబడిక గుదిరినప్పటికి '40 గంటల వారానికి' అచ్చటచ్చట యజమానులు వ్యతిరేకిస్తూనే వచ్చారు. అలాంటప్పుడు ప్రభుత్వంగూడ జోక్యం గలుగచేసికొని ఆ నిర్ణయాన్ని అమ లులో పెడుతూవచ్చింది.

పాప్యులరు ఫ్రంటు ప్రణాళిక ననుసరించి వ్యవసాయ వస్తువుల ధరలుగూడ నిర్ణయించబడినాయి. రైతులు దోపిడీ చేయబడకుండా కొంతవరకు అరికట్టబడింది. ఫాసిస్టు సంఘాలను అణచివేయడానికిగూడ కొంత ప్రయత్నం జరిగింది. మందుగుండు కర్మాగారాలను జాతీయపరం జేసే చట్టమొకటి చేయబడింది. ఫ్రెంచి బ్యాంకు కొంతవరకు ప్రభుత్వం ఆధిపత్యం క్రిందకు తేబడింది. మొత్తంమీద రెండు వందల కుటుంబాల హక్కులు కొంతవరకు తగ్గించబడినాయి. పాప్యులరు ఫ్రంటు ప్రణాళిక యీ విధంగా 1937 తొలి మాసాల వరకు అమలులో పెట్టబడుతూ వచ్చింది. కార్మికవర్గం భౌతికంగా ముందుకుపోతున్నారు. యజమానులు, అభివృద్ధి నిరోధకశక్తులు, మరల గుమిగూడి ఎదుర్కొడానికి ప్రయత్నించసాగాయి. పాప్యులరు ఫ్రంటును నాశనం గావించాలనే వారు శతవిధాలా ప్రయత్నాలు చేయసాగారు. అభివృద్ధి నిరోధక శక్తులకు లొంగిపోయి 1937 మార్చిలో పిరికిపంద అయిన బ్లమ్ 'పాప్యులరు ఫ్రంటు ప్రణాలికను అమలు జరపడంలో కొంత వ్యవధివుండాలి' అని ప్రకటించాడు. ఫ్రెంచి ఫాసిస్టులు, మిల్లుల యజమానులు, తుదకు బ్రిటిషు పాలకవర్గంచేగూడ బ్లమ్ ఒత్తిడిచేయబడుటచే ఆ ప్రకటన జరిగింది. ఈ ప్రకటనకు పాప్యులరు ఫ్రంటుప్రభుత్వం అంగీకరించింది. ఈ ప్రకటనతో పాప్యులరు ఫ్రంటు అంతరించేదినాలు వచ్చాయని గ్రహించుకోవాలి.

# 6. ప్రజల ఐక్య సంఘటన ఓటమి

1936 జూన్ నెలలో జరిగిన సమ్మెల ఫలితంగా ఫ్రెంచి పెట్టుబడిదారులు కార్మికుల తాత్కాలిక ఉధృతాన్ని చల్లార్చుటకు, యీ వ్యవధిలో తాము తమ శక్తులను గుమి గూర్చుకొని కార్మికులు సంపాదించిన కోర్కెల నన్నింటినీ మరలా పెరికివేయాలనే వుద్దేశంతోనే వారికోర్కెలకు అంగీక రించారు. అప్పటినుండీగూడ కార్మికులను మరలా అణచి వేయడానికి తీవ్ర ప్రయత్నాలు చేయసాగారు. బ్రిటిషు ప్రభుత్వం గాకపోయినప్పటికీ లండను బాంకర్ల ఒత్తిడివలన బ్లమ్, ఫ్రెంచినాణెము 'ఫ్రాంకు' యొక్క విలువను తగ్గించి వేశాడు. ఇది మొదటి ప్రయత్నము. ఇక రెండవ ప్రయ త్నము 1937 మార్చిలో బ్లమ్ ప్రకటించిన 'వ్యవధి' సూత్ర ము. ఈవ్యవధి తాత్కాలికంగానే వుంటుందని వారు బోధిం చినప్పటికీ అదేశాశ్వత వ్యవధి అయిపోయింది. ఆ 'వ్యవధి' ప్రకటన జరిగినతర్వాత ప్రజా ఐక్యసంఘటన ప్రణాళికలోని "పెట్టుబడిదారీ విధానాన్ని నాశనంగావించి సోషలిజానికి దోవ దీయుటకు" అనుకూలించే కార్యక్రమం కాకపోయినా, కనీస ఆర్థిక, రాజకీయ కోర్కెలను అమలుజరపడం ఆపివేశారు. ముసలితనంలో యిచ్చు పెన్షన్లు, బాగా ధనవంతులకు రాబడి పన్ను ఎక్కువగా విధించడం, ఫాసిస్టుసంఘాలను పూర్తిగా

అణచివేయడం, సివిలు_మిలిటరీ సంస్థలలో వున్న నిరంకుశ త్వాన్ని రూపుమాపడం-మొదలగు కార్యక్రమమైనా అసలు జరపడం మానివేశారు,

ప్రజా ఐక్యసంఘటన (పాప్యులరు ఫ్రంటు) కార్య క్రమంలో యింకొక కోర్కె- "విదేశాలకు పెట్టుబడిని ఎగుమతి చేయడం ఆపాలి" అని వుంది. ఈ కోర్కెను సెనేటు సభ (పెద్దల శాసనసభ) అంగీకరించలేదు. మెజారిటీ కోర్కెల కొరకు పోరాడుటకు మూరు బ్లమ్ రాజీనామాయిచ్చి బయ టకువచ్చాడు. దానితో పరిస్థితులు విషాదరూపం దాల్చుట కారంభించాయి. మరల చాటమ్సు ప్రధానిగా వచ్చాడు. అప్పటికింకా పాప్యులరు ఫ్రంటుకు 18 మాసముల క్రితము కంటే యెక్కువబలమే వుంది.

కాని అభివృద్ధినిరోధక శక్తులు తమ పంథాల ద్వారా పాప్యులరు ఫ్రంటును ఓడించడానికి పూనుకున్నాయి. కమ్యూనిస్టు, సోషలిస్టు, రాడికల్ పార్టీలలో చీలికలు తేడా నికి ప్రయత్నించాయి. కమ్యూనిస్టు కార్మికసంఘాలకు___ సోషలిస్టు కార్మికసంఘాలకు తమ శత్రువుతోటి పోరాటంలో ఐక్యతమాత్రమే కుదిరింది గాని ఫ్రెంచి కార్మికవర్గ మంతటికీ ఒకే కేంద్రీకృత నాయకత్వము, ఒకే సమ్మిళిత సంఘమూ ఏర్పడలేదు. మొదటినుండీకూడ కమ్యూనిస్టుపార్టీ యీ ఐక్యతకొరకే పాటుపడుతూ వచ్చింది. 1939 మే 29 న యీ సమ్మేళనకు రెండు సంఘాలనుండీ ఒక కమిటీ ఏర్పడి కమ్యూనిస్టుపార్టీచే లోగడే తయారుచేయబడిన ఒక చిత్తు

గల్గిన ఒక ఫాసిస్టు కుట్రసంఘాన్ని (కాగలార్డ్సుఅనేది) ఫ్రెంచి ప్రభుత్వం పట్టుకుందిగూడాను. వారిలో కొందరు అరెస్టుచేయ బడినారు.

బ్రిటను ఒత్తిడి ఎక్కువగుటచేత ఛాటమ్సు ఫ్రెంచి బాంకర్ల సాయంకోరాడు. వేరే మాటలలో చెబితే, ఫాసిస్టు చేతులలో కీలుబొమ్మ అయిపోయాడనాలి. దానితో అతడు రాజీనామా యీయడం, మరలా బ్లమ్ మంత్రివర్గం రావడం, కార్మికసంఘాలను పూర్తిగా అణచివేయ వలసిందిగా ఫ్రెంచి బాంకర్లనుండి ఒత్తిడి హెచ్చుగావడంచేత అతనుగూడ రాజీ నామా యీయడం జరిగింది. వ్యవహారమంతా గందర గోళంగా మారిపోయింది.

ఈసారి దలాదీరు ప్రభుత్వం మరల వచ్చింది. ఈసారి లోగడవలె అందరూ రాడికలుపార్టీ సభ్యులతోగాక కొందరు మితవాద, సెంటరు పార్టీల వారితో గలసి ప్రభుత్వాన్ని స్థాపించాడు. ఈ దలాదీరు యిదివరకటి సోషలిస్టు దలా దీరుగాడు. ఫాసిస్టుల చేతిలో కీలుబొమ్మగా మారిపోయిన దలా దీరు. 1938 ఆగష్టులో 40 గంటల వారానికి, పాప్యులరు ఫ్రంటుకు వ్యతిరేకంగా అతడు గావించిన వుపన్యాసంతో దలాదీరు ముఖంపై అంతవరకూ వుంటూవచ్చిన సోషలిస్టు ముసుగు కాస్తా తొలగి అచ్చరంగుతో బయటబడ్డాడు. మరలా ఫ్రెంచి నాణెంయొక్క విలువను (యిది నాల్గవ పర్యాయం) తగ్గించాడు. ఫ్రెంచి ప్రభుత్వం బ్రిటిషు ప్రభు త్వంచేతి కీలుబొమ్మగా మారిపోయింది. 1938 సెప్టెంబరు

29 న జరిగిన మ్యూనిక్ సమావేశంలో హిట్లరు, ముసోలినీ, ఛాంబర్లేనులతో కలసి దలాదీరు గూడ సూడెటన్ (1) ప్రాంతాన్ని జర్మనీకి అప్పగించడంతో ఫ్రాన్స్‌లోని పీపిల్సు ఫ్రంటు కాస్తా భగ్నమయింది. అంతేగాకుండా 1938 డిశెంబరులో ఫ్రెంచి విదేశాంగమంత్రి బోనెట్ జర్మనీతో ఒక ఒడంబడిక చేసుకున్నాడు. దానితో 1935 లో జరిగిన రష్యా—ఫ్రెంచి పరస్పర సహాయపు టొడంబడిక కాస్తా రద్దయిపోయింది. 1938 అక్టోబరు 29 తేదీని జరిగిన రాడికలుపార్టీ కాంగ్రెసులో వుపన్యసిస్తూ దలాదీరు ఫ్రెంచి కార్మిక వర్గంపైన ముఖ్యంగా కమ్యూనిస్టులపైన—తన క్రోధమంతా వెళ్లబుచ్చాడు. నవంబరులో జరిగిన పాప్యులరు ఫ్రంటుయొక్క జాతీయ సమావేశానికి రాడికలుపార్టీ ప్రతినిధులు రావడం మానివేశారు. దలాదీరు అదేమాసంలో కార్మికుల 40 గంటల వారాన్ని రద్దుగావించుతూ యింకాకొన్ని అత్యవసరచర్యలు తీసుకున్నాడు. ఫ్రెంచి పెట్టుబడిదారులు తాము చెప్పిన విధంగా దాలాదీరు నడవాలనీ హెచ్చరికగూడ యిచ్చారు.

ఈ విషాధ పరిస్థితులకు వ్యతిరేకంగా నవంబరు 30 తేదీని ఫ్రాన్సులో మరల కార్మికసమ్మెలు జరిగాయిగాని ఈసారి అమానుష చర్యలతో అణచివేయ బడినాయి. ఫ్రాన్సులోని పాప్యులరుఫ్రంటు ప్రభుత్వం కాస్తా కూలద్రోయ బడింది.

---

(1) జెకొస్లోవేకియాలోని జర్మనులు నివసించే ప్రదేశాన్ని సూడేటన్ ప్రాంతమంటారు.



జనరల్ డిగాల్.

ప్రస్తుతం హిట్లరుకు లొంగక ఫ్రాన్సునుండి పారివచ్చి 'స్వతంత్ర ఫ్రెంచిప్రజలు' అన్న పేర ఫ్రాన్సు విముక్తికై పోరాడుచున్న వారి నాయకుడు — జనరల్ ఛార్లెస్ జోసఫ్ మేరీ డిగాల్ టాంకుల యంత్రపరిజ్ఞానంలో విజ్ఞుడు. పారిస్‌నగరాన్ని నాజీలచేత బడకుండా రక్షించాలని వాదించినవాడు. జననం 1990. 1911 లో సైన్యోద్యోగి అయ్యాడు. 1914 లో దెబ్బతిన్నాడు. 1916 లో జర్మనులచేత ఖైదు చేయబడ్డాడు. యుద్ధానంతరం సిరియాలో పనిచేశాడు. 1930 లోనే ఫ్రెంచిసైన్యం యెక్కువ మంత్రిపరికరాల నుపయోగించాలని ఉపపాదించాడు. నాటియుద్ధాల్లో టాంకుల ప్రాముఖ్యాను చక్కగా గ్రహించిన ఫ్రెంచి వీరుడు యితడొక్కడే.

# 7. యుద్ధ సన్నాహాలు

ఫ్రెంచి పాప్యులరు ఫ్రంటు ప్రభుత్వం ఓడిపోడానికి యింకొక ప్రధానకారణం మనం గమనించవలసి యుంటుంది. అది ఫ్రాన్సుయొక్క విదేశాంగనీతి. 1936 జూన్‌లో బ్లమ్ ప్రభుత్వ మేర్పడిన రెండు నెలల లగాయితు స్పెయినుయెడల ఫ్రాన్సు అవలంబించిన విధానాన్ని పరిశీలించి చూడాలి. ఈ ఒక్క విషయంపైననే తర్వాత జరిగిన ఘటనలన్నీ (పాప్యులరు ఫ్రంటు ఓడిపోవడం, విద్రోహక శక్తులు గెలుపొందడం, శాంతి భగ్నమయి, యుద్ధము రావడం) ఆధారపడి యున్నాయి.

1936 ఫిబ్రవరి నెలలో జరిగిన ఎన్నికలలో స్పెయినులో పాప్యులరు ఫ్రంటు పార్టీలకు అమితమగు మెజారిటీ వచ్చింది. దానిఫలితంగా రాడికలు ప్రభుత్వమేర్పడి అనేక మంది రాజకీయ ఖైదీలను విడుదల గావించింది. ఇంకా స్పెయిను పాప్యులరు ఫ్రంటు ప్రణాళికలోగల కార్యక్రమాన్ని అమలు జరుప నారంభించింది. కాని స్పెయినులోని దోపిడిగాండ్రు ఇటలీ జర్మనీ ప్రభుత్వాల సాయంతో పాప్యులరు ఫ్రంటును నాశనం గావించాలని కుట్రలు పన్నుతూవచ్చారు. 1936 జూలై 17 న జనరలు ఫ్రాంకో నాయకత్వం క్రింద ఫాసిస్టు ముఠావారు పాప్యులరుఫ్రంటు ప్రభుత్వంపై తిరుగు

బాటు లేవదీశారు. మాడ్రిడు, బార్సిలోనా, యింకా కొన్ని ప్రాంతాలలో కార్మికులు, ప్రజాసామాన్యం ఫ్రాంకో తిరుగుబాటుదారులను చితుకగొట్టారు. స్పెయిను వుత్తరభాగాలలో మాత్రం ఫ్రాంకోవర్గం వారికి కొన్ని విజయాలు లభించాయి. ఇటలీ, జర్మనీలనుండి యీ తిరుగుబాటుదార్లకు కావలసిన ధనసాయము, ఆయుధాలు, విమానాలు, యితర పరికరాలు వచ్చిపడేవి. అంతేగాకుండా ఫ్రాంకోవర్గంవారు జయించిన స్పెయిను వుత్తరజిల్లాలలోనే సైన్యం, ఆయుధాలు వగైరా ఎక్కువగా వున్నాయి. పాప్యులరుఫ్రంటు ప్రభుత్వం యొక్క సైన్యం చాలవరకు క్రొత్తది. సరిఅయిన శిక్షణలేదు. నవీన యుద్ధపరికరాల నుపయోగించుటలో ప్రావీణ్యం గల్గియుండలేదు. ప్రభుత్వం యితర దేశాలనుండి విమానాలను, మందుసామగ్రిని, యితర యుద్ధపరికరాలను కొనవలసివచ్చింది. అంతర్జాతీయ న్యాయసూత్రం ప్రకారం స్పెయిను ప్రభుత్వం యితర దేశాలనుండి తనకు కావలసిన యుద్ధపరికరాలన్నింటినీ కొనుక్కోవచ్చును. అలాంటప్పుడు స్పెయినుకు ఆయుధాలు అమ్మే దేశాన్ని యింకే యితరదేశంగూడ అటకాయించ గూడదు. జోక్యంగూడ గలుగజేసికో కూడదు. తిరుగుబాటుదార్లకు యేయితర దేశంగూడ ఆయుధాలు సైన్యాలు పంపకుండా వుండాలని స్పెయిను ప్రభుత్వం కోరుటకుగూడ హక్కువున్నది. కాబట్టి స్పెయిను ప్రజా ప్రభుత్వానికి పూర్తిగా తోడ్పడవలసినవిధి తదితర దేశాలవారందరిపైనా వుంది. ముఖ్యంగా తనసరిహద్దు దేశమయిన స్పెయిను ఫాసిస్టు

లచే జయించబడి తనకు విరుద్ధమగు ప్రభుత్వమును ఏర్పరచ కుండా ఫ్రెంచిప్రభుత్వం విధిగా స్పెయినుకు కావలసిన సాయ మంతా చేయాలి. కాని తద్వ్యతిరేకము మాత్రం జరిగింది. ఫ్రెంచి ప్రభుత్వం స్పెయిను ప్రభుత్వానికి ఎట్టిసాయం చేయ డానికీగూడ నిరాకరించింది. అలా నిరాకరించడానికిగూడ తగిన కారణం లేకపోలేదు. ఆదినాలలో స్పెయినులో ప్రజా ప్రభుత్వాన్ని పడద్రోసి హిట్లరు—ఫాసిస్టు ప్రభుత్వాన్ని స్థాపించాలని బ్రిటిషుప్రభుత్వం దానిఅనుచరులు కోరుతుండే వారు. అందుచేత స్పెయినుకు ఎలాంటిసాయం చేయవద్దని బ్రిటిషు ప్రభుత్వం ఫ్రెంచిప్రభుత్వంపై ఒత్తిడిచేసింది. స్పెయిను ప్రభుత్వానికి ఎలాంటిసాయం పంపినా హిట్లరు ఫ్రాన్సుపై దాడివెడలే పక్షంలో తాము ఫ్రాన్సుకు ఏమాత్రం అండగా రాముసుమా! అని ఛాంబర్లేను, ఈడెన్‌లు ఫ్రెంచి ప్రభుత్వానికి హెచ్చరికలు యిస్తూవచ్చారు. ఈడెన్ సూచించిన ప్రకారం బ్రిటనువలెనే ఫ్రెంచిప్రభుత్వంగూడ తటస్థతా విధానాన్ని అవలంభించింది. బ్రిటిషు ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుగూడ యీ తటస్థత విధానాన్నే బలపర్చింది. బ్రిటిషు లేబరుపార్టీగూడ తథాస్తు అని వూరు కుంది. రెండవ అంతర్జాతీయ మహాసభలోని సోషలిస్టు పార్టీ లన్నీ (ఒక్క సోవియట్‌యూనియన్ మినహా) గూడ అదే పద్ధతిని బలపర్చాయి. సోవియట్ యూనియను మాత్రము స్పెయిను ప్రజాప్రభుత్వానికి అమితంగా సాయంచేసింది. స్పెయిన్ పోరాటాన్నిగూర్చి స్టాలిన్ యిలా అన్నాడు.

"ఇప్పుడు స్పెయినులో జరుగుచున్న పోరాటం కేవలం స్పెయిను ప్రజలకే సంబంధించింది కాదు. ఇది ప్రపంచంలోని అభివృద్ధికరమైన, ముందుకు నడుస్తూన్న ప్రజాసామాన్యాని కంతటికీ సంబంధించిన పోరాటం"

యూరపునందంతటా, మిాదుమిక్కిలి ప్రపంచ ప్రజా సామాన్య మందరు స్పెయిను ప్రజాస్వామ్యానికి సాయపడడా నికి నడుము:బిగించారు. అప్పుడు స్పెయినులో జరిగే పోరాటం అభివృద్ధి నిరోధకశక్తులు, ఫాసిజం, యుద్ధాలకు వ్యతిరేకంగా ప్రజలందరి ఆశయమగు ప్రజాస్వామ్యం, శాంతి ఆశయాలకే. అంటే తమందరికోసమే ఆ పోరాటం జరుగుతూందని ప్రపంచ ప్రజాసామాన్యం గ్రహించింది. ఫ్రాన్సు, బ్రిటను, అమెరికా, కెనడా, యింకా యితరదేశాలలోని వర్గచైతన్యం గల ప్రజలు స్పెయినుకు అన్నివిధాల సాయంచేశారు. వివిధ దేశాలలో కార్మికులు తాము చందాలువేసికొని స్పెయినుకు ఆర్థికసాయము, తినుబండారాలు పంపించారు. స్పెయిను ప్రజాప్రభుత్వాన్ని రక్షించుకోడానికి తమకు చేతనయినదంతా చేశారు. కాని యీా ప్రయత్నాలన్నిగూడ బ్రిటిషు-ఫ్రెంచి ప్రభుత్వాలచే అరికట్టబడుతూ వచ్చాయి.

అయితే అలాంటి తటస్తతా విధానాన్ని, (సంతృప్తి పరచే విధానాన్ని) అవలంబించుటలో బ్రిటను, ఫ్రెంచి ప్రభుత్వాల అంతరార్థమేమిటి? ఈ సంతృప్తిపరచేవిధానాన్ని అవలంబించడం ఛాంబర్లేను తెలివితక్కువ వల్లనా? బలహీనతవల్లనా? ధైర్యం లేకపోవడం వల్లనా? లేక, యింకే మైనా భాధ్యతలున్నాయా? హిట్లరు, ముసోలినీలను యీా

విధంగా బలపర్చడం ముందుకు తమకుదెబ్బయని బ్రిటిషు పాలకవర్గం గుర్తించలేదా? దూరప్రాచ్యంలో జపాను ముందుకుపోవడం బ్రిటను హక్కులకు నష్టమని వీరికి గోచరించలేదా? స్పెయినులో ఫ్రాంకోనియం తృత్వం ఏర్పడితే మధ్యధరా సముద్రంగుండా ఇండియాకు పోయే తన రహదారికి భంగమని వీరికి తెలియదా? 1935 లో హిట్లరు నౌకాబలాన్ని, సబ్మరైనులను అధికంగా నిర్మించుకొనేందుకు అంగీకరించడం తమ నౌకాబలానికి హానిలేదనా? ఈ విషయాలన్నీ తమకు తెలియకగాదు. వీరందరి దృక్పథంగూడ సోవియట్ యూనియనును హతమార్చాలనే. అందుచేతనే హిట్లరును, యితరఫాసిస్టు ప్రభుత్వాలను బలపర్చుతూవచ్చారు. సోవియటు యూనియను తమతమ వ్యాపార రంగాలలోగాని, యింకేవిషయంలోగాని తమతో పోటీదారుగా వున్నదని గాదుగాని, అచట శ్రామికప్రభుత్వ మేర్పడి దినదినానికి ఆర్థికంగా, సాంఘికంగా, నైతికంగాగూడ బలపడుతూ, తదితర దేశాల శ్రామికవర్గానికి విప్లవచైతన్యం గల్గించుచున్నదనీ, పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోయవలసిందిగా బోధించుచున్నదనీ, తత్ఫలితంగా ప్రతిదేశంలోనూ పాప్యులరు ఫ్రంటు ప్రభుత్వాలు యేర్పడుతున్నాయనీ, యీ పాప్యులరు ఫ్రంటులవెనుక ప్రతిదేశంలోనూ కార్మికవర్గం విప్లవానికి బాటవేసుకుంటూందని గ్రహించి అసలు సోవియట్ యూనియనునే నాశనం గావించితే ప్రమాదంపోతుందని దానిపైనే తమ దృష్టిని కేంద్రీకరించారు. తమతమ అధికారాలనూ, హక్కులనూ నిలబెట్టు

కునేందుకు తామెంతటి నష్టకష్టాలకయినా ఓర్చి సోవియట్‌పై యుద్ధానికి ప్రయత్నించసాగారు. ఏటన్నింటి ఫలింతగా మ్యూనిక్ సమావేశంతో సోవియట్ యూనియను విడబడిపో యింది. ఐరోపాయుద్ధమో, లేక ప్రపంచయుద్ధమో తప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి. పాప్యులరు ఫ్రంటు ప్రభుత్వాలు భగ్నమయ్యాయి.

మ్యూనిక్ సమావేశాన్ని గురించి జిలియాకస్ యిలా వ్రాశాడు.

"ఇక ఫ్రాన్సు పెద్దరాజ్యంగా వుండజాలదు. బ్రిటిషు ప్రభుత్వం హిట్లరు, ముస్సోలినీలకు కీలుబొమ్మగా తయారయింది. స్పెయిను, హాలెండు, స్వీడన్‌లు గతశతాబ్దాలలో పెద్ద రాజ్యాలుగావుండి యిప్పుడు క్షుంఃపో యినట్లే యిప్పుడు ఫ్రాన్సుగూడ మూడవరకపు దేశంగా తయారయింది. ట్యూనిసును గాని, మొరాకోనుగాని, లేక తన యితర కాలనీలనుగాని హిట్లరు, ముస్సోలినీలకు వ్యతిరేకంగా ఫ్రాన్సు ఒంటరిగా కాపాడుకో జాలదు."

పామీదత్తు నుడివినట్లుగా "ఫ్రెంచి బూర్జువావర్గం తన వర్గాధికారాన్ని నిలబెట్టుకోడానికిగాను పెద్ద రాజ్యంగా వుండే ప్రాబల్యాన్ని ఆత్మహత్య గావించుకుంది."

ఫ్రెంచి ప్రభుత్వానికి రిబ్బన్‌ట్రాపుకు జరిగిన సంభాష ణలనుగూర్చి లండను, బెర్లిను, బార్సిలోనా, ప్రేగు (మాస్కో-లేదు) లలోని ఫ్రెంచి రాయబారులకు పంపిన లేఖలో బోనెట్ యిలా వ్రాశాడు.

"రిబ్బన్‌ట్రాఫ్ యిలా సూచించాడు. రెండు యాక్సిసు కూటమీ లకు ((1) జర్మనీ-ఇటలీ, (2) బ్రిటను-ఫ్రాన్సు) పరస్పర సహాయాన్ని సూచించాడు. మ్యూనికు సమావేశంలో బెర్లిను-రోము యాక్సిసు వైఖరి

బోల్షివిజానికిపూర్తిగ్యతిరేక పోరాట వైఖరియట. జర్మనీ, స్పెయినలలో అవలంబించిన వైఖరికూడ బోల్షివిజానికి వ్యతిరేకమే నన్నాడు.”

ఈ పై విషయాలన్నింటినిబట్టి ఫ్రాన్సుకూడ సోవియట్ యూనియనుకు పరస్పర విరుద్ధవైఖరినే అవలంబించిందని (మ్యూనికుద్వారా) సులభంగా గ్రహించవచ్చును. ఫ్రెంచి పాలకవర్గంయొక్క ఆశయం హిట్లరును ఎలాగయినా తూర్పుదిశకు (సోవియట్ యూనియనుపైకి) మరలించడం, అటు సోవియట్ యూనియనును, ఇటు జర్మనీనికూడ ఓడించడం. పెట్టుబడిదారీ ప్రభుత్వాలు జర్మనీ సోవియట్‌పై యుద్ధం ప్రకటించుతుందని ( 1938లో ) ఎదురుచూస్తున్నాయి. కాని నాజీలు అందుకు తయారవడంలేదు. బ్రిటను, ఫ్రాన్సులు చేసిన సాయంతో నాజీలు అమితంగా బలపడినమాట వాస్తవమే. బోల్షివిజం అంటే నిప్పులు గ్రక్కేదికూడ నిజమే. జర్మనీ యుద్ధానికి సర్వసన్నాహాలు చేసుకుందిగాని ఛాంబర్లేను, దలాదీర్లు అప్పట్లో తలంచుచున్నట్లుగా తూర్పుదిశకు మాత్రముగాదు. సోవియట్ యూనియనుయొక్క బలము నాజీలకు క్షుణ్ణంగా తెలుసు. 1936 లో హిట్లరుకు, తనకూ జరిగిన సంభాషణలనుగూర్చి తాను వ్రాసిన ‘మనము-జర్మనీ’ అనే పుస్తకంలో లార్డు లండన్‌డెరీ యిలా వ్రాశాడు—

“మా సంభాషణలలో హిట్లరు యీ క్రింది అభిప్రాయాలను వెలిబుచ్చాడు. సోవియట్ యూనియను ఒక పెద్ద మిలిటరీ కేంద్రమే గాకుండా ఒకే ఆదర్శంయొక్క ప్రతిబింబము ఎందువల్లనంటే రష్యా 19,00,00,000 జనసంఖ్యను కల్గియుంది. రష్యాను బ్లాకేడుద్వారా జయించడం సాధ్యపడదు. విమానదాడులకు అలవికానటువంటి తన సరిహద్దుకు

నాల్గు—ఆరువేల మైళ్ళ దూరంలో తన పరిశ్రమలు భద్రమయిన స్థానాలలో వున్నవి. ఈ పైనాల్గు విషయాలే రష్యాయొక్క శక్తి సంపదలను నిరూపించుతాయి.

రష్యాకు ప్రపంచంలోకల్లా బలమైన సైన్యం, బలమైన టాంకుదళం, బలమైన విమానదళం—వున్నాయి. ఈ నైవిషయాలన్నీ మనం మరువ గూడదు "

కాబట్టి సోవియట్‌పై యుద్ధం ప్రకటించడానికి జర్మనీకి గుండె లేకపోయింది. కాని బ్రిటను ఫ్రాన్సులు అందుకు ఎదురు చూస్తూన్నాయి. ఫ్రెంచి విదేశాంగమంత్రి బోనెట్‌కు జర్మను రాయబారికి జరిగిన సంభాషణలనుగూర్చి 'ఫ్రెంచి ఎల్లోబుక్కు' 176 పేజీలో యీ క్రిందివిధంగా వుంది.

" తుదకు నేను జర్మను రాయబారికి యిలా చెప్పాను. ఫ్రెంచిజాతి అంతాగూడ ప్రభుత్వానికి యిప్పుడు అండగానిల్చివుంది. ఎన్నికలు జరుపడం ఆపివేయబడుతుంది. బహిరంగసభలు, సమావేశాలు—ఆపివేయబడతాయి. ఇతరదేశములకు సంబంధించిన ఏవిధమైన ప్రచారముగూడ అంత మొందించబడుతుంది. కమ్యూనిస్టులంతా అరెస్టుచేయ బడతారు."

వీటన్నింటినీబట్టి సోవియట్ యూనియన్‌పై జర్మనీ యుద్ధం ప్రకటించాలని ఫ్రెంచి పాలకవర్గానికి ఎంత ఆతురతగా వుందీ స్పష్టపడుతుంది. వీరిలా అర్రులుచాచి గూర్చున్నప్పటికీ హిట్లరు రష్యాపైకిపోడని తేటతెల్లమయింది. ఈ క్షణమో, మరుక్షణమో యుద్ధము ప్రారంభించేలా వున్నది. అయినప్పటికీ బ్రిటిష్వు, ఫ్రెంచి పాలకవర్గాలు సోవియట్ యూనియనుతో గలసి శాంతికూటమిని ఏర్పరచుటకు నిరాకరించాయి.

~~~
~~~

# ౩. యుద్ధము-అభివృద్ధి నిరోధకులు గెలుపొందుట

ఇంతవరకు ఫ్రాన్సులోని పాలకవర్గానికి—కార్మిక వర్గానికివున్న సంబంధాలను తెలుసుకున్నాం. ఈ అధ్యాయంలో యుద్ధముపట్ల ఫ్రాన్సులోని యీ రెండు వర్గాలపంథా ఏమిటో చూడవలసి యుంటుంది.

సాధారణంగా యుద్ధముయొక్క స్వభావం తెలుసుకోవడం అంత తేలికయిన విషయంగాదు. యుద్ధం ప్రారంభింపబడినవెంటనే అది దురాక్రమణకు జరిపే యుద్ధమో, లేక ఆత్మరక్షణకు జరిపేయుద్ధమో నిర్ణయించడంలో ఎలాంటి ప్రయోజనమూ వుండదు. ఇలాంటి విషయాలకు ఋజువులు, నిర్ధారణలు జేయవలసి యుంటుంది. నాజీ జర్మనీ పోలెండుపై యుద్ధం ప్రకటించిందనగానే వెంటనే జర్మనీ దురాక్రమణకు దిగిన దేశంగా కన్పించుతుంది. ఇక రెండవ విషయంచూద్దాం. బ్రిటను, ఫ్రాన్సులు జర్మనీపై యుద్ధం ప్రకటించాయి. కారణం, పోలెండు స్వాతంత్ర్యాన్ని, యితర చిన్నదేశాల స్వాతంత్ర్యాన్ని కాపాడుటకోసమన్నాయి. అయితే, హిట్లరు యిదివరకే అనేక ప్రమాణపత్రాలను, సంధి సూత్రాలను వుల్లంఘించి దురాక్రమణ జరిపాడుగదా—అప్పుడే బ్రిటను, ఫ్రాన్సులు యిందుకుచర్య తీసుకోలేదేమి? అన్నప్రశ్న బయలే

# ఫ్రెంచి సామ్రాజ్యం

పక్కపుటలో నల్ల గుర్తులు పెట్టిన దేశాలన్నీ ఫ్రెంచి సామ్రాజ్యానికి చెందినవి. (1) ఫ్రాన్సు, (2) ఫ్రెంచి పశ్చిమ ఆఫ్రికా, (3) కామరూన్లు, (4) మెడగాస్కర్, (5) ఫ్రెంచి ఇండోచైనా (6) సెంట్ పాల్ దీవులు (7) న్యూ కలడోనియా, (8) ఫ్రెంచి గియనా.

గొప్ప వలససామ్రాజ్యాల్లో రెండోదానిని ఫ్రాన్సు కలిగుంది. ఈసామ్రాజ్య విస్తీర్ణం 45,00,000 చదరపుమైళ్ళు. ఇందులో ఎక్కువభాగం ఆఫ్రికాలో ఉన్నవి. ఈ వలస రాజ్యాలకు అధినివేశ ప్రతిపత్తిలేదుగాని, తమ ప్రతినిధులను ఫ్రెంచి శాసనసభల కెన్నుకుంటేవి. 1940 జూన్‌లో ఫ్రెంచి ప్రజాస్వామ్యం హిట్లరుకు లొంగిపోయింది. అంతటితో ప్రజాస్వామ్య మంతరించింది.





ST. PIERRE &
MIQUELON
MOROCCO
ALGERIA
1
SYRIA
TUNIS
2
FRENCH
W. AFRICA
CAMEROONS
F.
SOMALILAND
3
IVORY
COAST
DAHOMEY
FRENCH
GUIANA
CAYENNE
8
MAHE
FRENCH
INDO
CHINA
5
MADAGASCAR
4
REUNION
6
NEW
CALEDONIA
7

రకే తప్పదు. జర్మనీకి వ్యతిరేకంగా జెకోస్లోవేకియాను, ఇటలీకి వ్యతిరేకంగా ఆల్బేనియాను, కాపాడలేదేమి ? ఇలాంటివి లక్షప్రశ్నలు బయలుదేరుతాయి. ఇవన్నీ పరిశీలించితేనే గాని, అంటే గత చరిత్రఅంతా తిరగవేస్తేనేగాని యుద్ధానికి కారణాలు బోధపడవు. వీరెన్ని మోసపుతబుర్లు చెప్పినా సోవియట్ యూనియన్‌ను హతమార్చాలని బ్రిటను, ఫ్రాన్సులు చేసిన ప్రయత్నాలన్నీ సువిదితం. స్టాలిన్ నుడివినట్లుగా యీ నాటకం అంతా తుదకు ఆడినవారికే విషాదాంతంగా పరిణమించింది. కాబట్టి మళ్లా యుద్ధకారణాలన్నీ విశదీకరించాల్సిన అవసరంలేదు. యుద్ధము, దానియెడల ఫ్రాన్సువైఖరీ మాత్రమే యిప్పుడు మనం చూడవలసి యుంటుంది.

## యుద్ధంపట్ల వివిధ వైఖరులు

స్పెయినులో వర్గపోరాటం దినదినానికి తీవ్రతరమై తుదకు అంతర్యుద్ధంగా పరిణమించింది. కాని ఫ్రాన్సులో పాప్యులరుఫ్రంటు కూటమితోనే శత్రువులు బయలుదేరారు. పాప్యులరుఫ్రంటు ప్రభుత్వం రెండువందల కుటుంబాల ఆజ్ఞలనే శిరసావహించవలసి వచ్చింది. వర్గపోరాటంగూడ మంచి స్థాయిలోనే వుందిగాని అభివృద్ధినిరోధక శక్తులదే పైచేయిగా మారింది. యుద్ధం ప్రారంభ మవడమే తడవుగా ఫ్రెంచి పాలకవర్గం కార్మిక వర్గంమీద, ప్రజాసామాన్యంమీద ఎక్కువ ఆంక్షలువిధించి అణచివేయ ప్రారంభించింది. పాప్యులరుఫ్రంటుకు, 40 గంటల వారానికి, విరోధులయిన ఫ్రెంచి పాలకవర్గమే యీ యుద్ధాన్ని ప్రారంభించిందనీ, యిది అభి

వృద్ధినిరోధక యుద్ధమనీ, యింకూలో ప్రజాసామాన్యానికి ఎలాంటి సంబంధం వుండకూడదని ప్రజాసామాన్యం తలంచింది. యుద్ధముయొక్క కళ్ళెము ఆక్రొద్దిమంది ధనికుల చేతులలోనే యుంది. మొదటినుండీ స్వదేశంలోనూ, పరదేశాలలోనూ ఫాసిజంతో సహకారంచేసి బలపర్చుతూ వచ్చిన అభివృద్ధినిరోధక (రియాక్షనరీ) ప్రభుత్వం యిప్పుడు అపరదేశ ఫాసిజంతో యుద్ధం ఆరంభించితే (అపరదేశ ప్రభుత్వంకంటె యింకా అవినీతికరమైనదే గావచ్చు) యీ రియాక్షనరీ ప్రభుత్వంయొక్క గుణగణాలు మారినాయా? తమ ప్రభుత్వం సామ్రాజ్యవాద ఆశయాలకు మాత్రమే యుద్ధం ఆరంభించిందనీ, ఫ్రెంచి కార్మికులు, ప్రజాసామాన్యం గ్రహించారు. అందుచేతనే, 1936 నుండి 1939 వరకు స్పెయిను ప్రజలను వుడుకెత్తించిన ఆ ఆవేశంగాని, 1937 నుండి నేటివరకు అమితదీక్షతో యుద్ధం చేస్తున్న ఆ చైనా ప్రజల పట్టుదలగానీ, యుద్ధంపట్ల ఫ్రెంచి కార్మికులకూ యితర ప్రజలకు లేకపోయింది. వుండుటకు అవకాశమే లేదు.

## ప్రజాహింస.

యుద్ధం ప్రారంభించబడిన మొదటినుండిగూడ ఫ్రెంచి ప్రభుత్వం యిద్దరు శత్రువులను ((1) జర్మను ఫాసిజం. (2) ఫ్రెంచి శ్రామికవర్గం)ఎదుర్కోవలసివచ్చింది. యుద్ధం ప్రారంభమయిన తొలిదినాలనుండీకూడ ఫ్రాన్సులో ఒక తమాషా, ప్రచారం బయలుదేరింది. ఫ్రెంచి కార్మికవర్గమే తమకు ప్రబలశత్రువనీ, కార్మిక పరిపాలనకన్నా జర్మనీ ఫాసిస్టుపాలనే

మంచిదనీ ఆ ప్రచారంయొక్క సారాంశం. ఇలాంటి ప్రచారాన్ని ఫ్రాన్సులోవున్న బ్రిటను పరిశోధకులు పెక్కుమార్లు గమనించారు.

'న్యూయార్కుపోస్టు' అన్న పత్రికలో ఎడ్గార్ మోరర్ యిలా వ్రాశాడు.

"యుద్ధానంతరం కార్మికవిప్లవం తప్పదనే భయంవల్ల యీ యుద్ధములో తాము ఓడిపోయినప్పటికంటె జయించినట్లైతేనే ఎక్కువ ప్రమాదముందని ఫ్రెంచి ధనికులలో చాలమంది భయపడ్డారు."

ఫ్రాన్సులో కార్మికవర్గాన్ని అణచే మొదటి ప్రయత్నాలు యుద్ధానికిపూర్వంనుండే ఆరంభించబడినాయి. ఎన్నో పర్యాయాలు అత్యవసరమయిన వంటూ కొన్ని చట్టాలు తయారుచేసి పార్లమెంటు సభ్యులకున్న అధికారాలు గూడ లాగివేశారు. ఫాసిజానికి మంచి బాటవేయబడుతూ యుంది. 1939 వేసంగిలోనే ఫ్రెంచి ఎన్నికలు జరుపుట వాయిదా వేయవలసిందిగా ఒక ప్రస్తావనవచ్చింది, ఫ్రాన్సులో యిలాంటి ప్రస్తావనలు గత 50 ఏండ్లలోనూగూడ ఎంతటి రియాక్షనరీ ప్రభుత్వమైనాగూడ చేయలేకపోయింది. కాని యిప్పుడు అలాంటి ప్రస్తావన అతిసులభంగా తేబడింది. దాని ఫలితంగా, 1940 వసంతఋతువులో జరుగనున్న ఎన్నికలను ఒక యేడాదికాలం పొడగించారు. ఎన్నికలకు యిలావాయిదా వేయడంకు కారణం ఎన్నికలు జరిపితే అందులో ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీకి అధికమైన బలం లభించుతుందను భయమేనని ఫ్రాన్సులోని కొన్ని పత్రికలు అప్పుడే సూచించాయి.

ఇక రెండవప్రయత్నం.

1939 జూలైలో ఫ్రెంచి విదేశాంగమంత్రి బోనెట్ 'లాహ్యూమనైట్' అనే కమ్యూనిస్టు వార్తాపత్రికకు మేనే జింగు డైరెక్టరు, సంపాదకులలో నొకడునూ అగు లూషి యన్ సాంపైను అరెస్టుచేశాడు. కారణం యిద్దరు ప్రముఖ పత్రికా విలేఖరులు జర్మనీనుండి డబ్బుతీసుకుంటూ ఫ్రాన్స్‌లో కుట్రలుచేస్తున్నారనే నేరంక్రింద అరెస్టుచేయబడ్డారు. కాని వారిద్దరిపేర్లూ మాత్రము రహస్యంగా వుంచబడినాయి. 'లాహ్యూమనైట్' పత్రికలో ఒక వ్యాసంలో లూషియాన్ సాంపై ఆ రెండు పేర్లనూ ప్రచురించినాడట. అందుచేత అరెస్టుచేశారు. డిఫెన్సులో సాంపై యిలా సాక్ష్యమిచ్చాడు. "జర్మనీనుండి డబ్బుతెప్పించుకుంటూ ఫ్రాన్స్‌లో కుట్రలు పన్నుతున్నవారి ముఠా మితిమీరిపోయింది. తాను పత్రికా సంపాదకుడూ, కమ్యూనిస్టు, ఫ్రెంచిదేశస్తుడూ, అయిన కారణాలచేత అలా ప్రకటించడానికి తనకు పూర్తిఅర్హత గలదని వాదించాడు." ఫ్రెంచి ప్రజల జయజయధ్వనుల మధ్య సాంపైను వదలివేసారు. అయినప్పటికీ యీ కేసుద్వారా కార్మికులలో చైతన్యం ఎక్కువైంది.

ఇంకొక నెల గడచినపిమ్మట మూడవప్రయత్నము జరిగింది. సోవియట్ యూనియనుకు జర్మనీకి అనాక్రమణ సంధి జరిగింది. యుద్ధము యిక పదిదినాలలో ప్రారంభం కానున్నది. ఇక బోనెట్, తాను లోగడ జర్మను రాయబారికి చెప్పిన ప్లానును ఆచరణలోనికి తీసుకురావడానికి మంచి అవకాశం

దొరికింది, 'లాహ్యూమనైట్' 'సీసోయర్' అనే పారిసు కమ్యూనిస్టు పత్రికలను నిషేధించాడు. ఫ్రాన్సు జర్మనీపై యుద్ధాన్ని ప్రకటించే తేదీని యింకా వెనక్కు నెట్టాలని బోనెట్, యింకా ఫ్రాన్సులోని హిట్లరు మిత్రులు తమశాయశక్తులా సెప్టెంబరు 1,2, తేదీల ప్రయత్నించారు. ఎలాగయితేనేం ఫ్రాన్సుగూడ సెప్టెంబరు 3 న యుద్ధం ప్రకటించింది. యుద్ధం ప్రకటించిన తదుపరి 9 నెలలు ఫ్రాన్సులో నిరంకుశత్వం చెలరేగిపోయింది. అత్యవసరమయినటువంటి అనేక చట్టాలు చేశారు. నిర్బంధసైనిక చర్యల నవలంబించారు. సెన్సారు పిష్షు అధికమయింది. వార్తలనేగాకుండా అభిప్రాయాలనుగూడ నిషేధించారు. సెన్సారు పిష్షు అంత తీవ్రంగావున్న కారణంచేత ఆ నాటి పత్రికలన్నీ కార్టూనుల తోనూ, అడ్వర్ టైజుమెంటులతోనూ నిండియుండేవి. ఫ్రాన్సులోని యీ అంతర్విషయాలనుగూర్చి ఫ్రాన్సు పతనమయ్యే వరకూ ఒక్కరుగూడ యే విషయాన్నిగూర్చి బయటబెట్టక మూగనోము నోచారు. ఇప్పుడిప్పుడు ఫ్రెంచి చరిత్రకారులు, పండితులు ఒకరితో మరియొకరు పోటీచేసుకుంటూ ఆ రహస్యాలన్నీ పుటలునింపివేస్తున్నారు. ఇలాంటి విషయాలను లోగడే తెలిపియుంటే ఎక్కువగా వుపకరించియుండేది.

యుద్ధం ప్రారంభమయిన తర్వాత ఫ్రాన్సులో అనేక గూడుపుఠానీలు జరిగాయి. ముఖ్యంగా మనం అయిదారు విషయాలను చూస్తే రియాక్షనరీ ప్రభుత్వం ఎలా పనిచేస్తూ వచ్చిందీ బోధపడుతుంది. వాటిలో మొదటిది, ముఖ్యమైనదీ

ప్రభుత్వంలోని గొప్పగొప్ప ఉద్యోగాలు, యుద్ధాన్ని కొనసాగించడానికి ఏర్పరుచబడినవారూ ఎలాంటివారో చూడాలి. యమ్. డిలాన్ కిల్ అనేఅతను యుద్ధానికి పూర్వపు దినాలలో దగాకోరు. జర్మను గూఢచారి అనునేరాలక్రింద ఖైదీగా వున్నాడు. యుద్ధం ఆరంభమయిన కొలది దినాలకే అతడు సరఫరా మంత్రిగా ప్రధానపదవిలో నియమింపబడ్డాడు. ఇంకా ఫాసిస్టు సంఘాలకు సంబంధించిన చాలమంది యిలాంటి భాధ్యతాయుత స్థానాలకు నియమితులయ్యారు. మొదట కమ్యూనిస్టు, తర్వాత స్వామిద్రోహి, పోలీసుల ఏజంటుగా తయారయిన జాక్సు జోరియట్ గొప్ప ఫాసిస్టుసంఘాన్ని ఏర్పరచాడు. అతడు యుద్ధంరాగానే, సెన్సారు పిప్పు బోర్డులో ప్రధాన స్థానం అలంకరించాడు. ఇక సైన్యంలో ఉన్నతాధికారాలన్నీ గూడ గూఢచారులవే అయినాయి. ఈ విధంగా సైన్యశాఖలలోనే ప్రధానస్థానాలను, ప్రభుత్వోద్యోగాలలోనూ ఫాసిస్టులు ముఖ్యోద్యోగులుగా రావడంవలన ఇటలీ, జర్మనీలు తమ ప్రచారాన్ని దేశంలో విరివిగా సాగించడం బహు సులభమైంది. ఆప్రచారం 1940 వేసంగికి పరిపక్వరూపం దాల్చింది.

### సోవియట్ పట్ల ద్వేషం.

రెండవది సోవియట్ యూనియను యెడల ఫ్రెంచిపాలకవర్గానికి గల ద్వేషము, సోవియట్ అంటే బ్రిటను, అమెరికాలకుగూడ యింతగానే క్రోధముందిగాని ఫ్రెంచిపాలకవర్గం తన క్రోధాన్ని యింకా ఎక్కువస్థాయికి తీసుకెళ్లింది. ఫ్రెంచి పాలకవర్గం పారిస్‌లోని సోవియట్ రాయ

బారి పారిసును వదలి స్వదేశానికి పోవాలని ఒత్తిడి తీసుక వచ్చారు. కారణం సోవియట్ యూనియను అవలంబించే వైఖరికి తన ఆమోదాన్ని తెలియచేస్తూ ఒక ప్రైవేటు టెలిగ్రాము (ఫ్రెంచి సెన్సారుషిప్పు బోర్డువారు యీ టెలిగ్రామునుగూడ చదివేపంపించారు) రష్యాకు పంపించాడనే నెపము. ఫిన్లాండు అంతర్నాటకంలో ఫ్రెంచి పాలకవర్గానికి సోవియట్ యూనియనుపై గల ద్వేషం మరీ బట్టబయలయింది. సోవియట్-ఫిన్లండు యుద్ధంలో ఫిన్లండుకు సాయంగా 50 వేల సైన్యాన్ని పంపించుటకు ఫ్రెంచి పాలకవర్గం నిర్ణయించింది. ప్రపంచంలో బలమైన మిలిటరీ శక్తి యగు ఎర్రసైన్యాన్ని ఎదుర్కోడానికి తయారయింది. రేపో మాపో నాజీలతో యుద్ధం చేయవలసివస్తుందని గ్రహించనైనా లేకపోయింది. కాని ఫ్రెంచిసేనలు ఫిన్లండు రంగానికి బయలుదేరకముందే ఫిన్లండు ప్రభుత్వం సోవియట్‌కు పాదాక్రాంతమయింది.

## సేనానాయకుల అసమర్థత-మోసం.

నిరంకుశులు, అభివృద్ధి నిరోధకులు అయిన ఫ్రెంచి సేనానాయకుల అసమర్థత మూడవది. వీరంతా 1914-18 యుద్ధాన్నే గుణపాఠంగా తీసికొని పనిచేయసాగారు. అందువల్ల వీరు గత యుద్ధకాలంలోని దుర్ఘటనలను వేటినీ మరచిపోలేక. క్రొత్తవి నేర్చుకున్నదిలేదు. అదే అనుభవంతో యుద్ధప్లానులు వేయసాగారు. ఫిన్లండు యుద్ధంలో రష్యాసేనలు పారఛూటులద్వారా సైన్యాలను దింపడంచూచి వీరు

హేళనచేశారు. ఆధునిక యుద్ధాలలో వుపయోగించబడే టాంకుల, విమానాల ప్రాముఖ్యత వీరు లెక్కచేయలేదు.

యుద్ధ సన్నాహాలలోగూడ వీరి తెలివి తక్కువ గన్పించుతుంది. ఉదాహరణకు రెనాల్టు కర్మాగారాలలో శాంతి దినాలలోనే ముప్పదివేలకు తక్కువగాకుండా కార్మికులు పని చేస్తుండేవారు. అలాంటిది యుద్ధం ఆరంభమయిన పిదప యీ ఫాక్టరీలలోని (యివిటాంకులు, ట్రక్కులు ఉత్పత్తిచేసే ఫాక్టరీలు) కార్మికుల సంఖ్య అయిదువేలకులోపు వుంది.

ఇక ఫ్రాన్స్‌లో దగాకోరుతనానికి హద్దే లేకపోయింది. ప్రజలు నానాఅవస్తలు పడుతున్నారు. మరియొకవైపు గత యుద్ధంలోవలెనే యజమానులు లాభాలు గుంజుతూనే యున్నారు. ఇంకొకవైపు సరకులుగూడ జర్మనీకి ఎగుమతి చేయబడుతున్నాయి. ఆంద్రేమార్టే 'ఫ్రెంచి కమ్యూనిస్టు డెప్యూటీల విచారణ' అనే గ్రంథంలో యిలా వ్రాశాడు—

"కార్మికులు నానాయిబ్బందులు పడుతున్నారు. చెడ్డదారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారు. కార్మికసంఘాలు నాశనంగావించబడ్డాయి. స్వేచ్ఛ కొరకు యుద్ధం అనేపేరుతో సాంఘిక చట్టాలుగూడ రద్దుచేయబడ్డాయి. కాని రైలుబండ్లనిండా ముడి యినుము ఫ్రాన్స్‌నుండి లగ్జంబర్గు, బెల్జియంల గుండా యీ మధ్య ఎక్కడా ఆగకుండా జర్మనీకి అందించబడుతూనే యుంది."

ఒకవైపు జర్మనీతో యుద్ధంచేస్తూనే మరియొక వైపు జర్మనీకి యీవిధంగా రైలుబండ్లనిండా సరకులు అందించబడుతున్నాయంటే ఫ్రాన్స్‌లో ఫాసిజానికి ఎంతబలం ఏర్పడిందీ సులభంగా తెలుస్తుంది. అంతేగాకుండా ప్రెస్ సెన్సార్

షిప్పు 1939 సెప్టెంబరునుండి తీవ్రంగా అమలు జరుపబడుతూ న్నందున దినదినానికి విజృంభిస్తూన్న యీ దగాకోరుతనం ప్రజ లకు తెలియకుండా వుండడానికి, ప్రజాస్వామ్య శక్తులు విజృం భించకుండా అరికట్టడానికి బాగా తోడ్పడింది. ఈ పై విష యాలన్నింటినీబట్టి ఫ్రాన్స్‌లో నాజీలబలం అమితంగా వుందని బోధపడుతుంది.

1939 సెప్టెంబరు ఆరంభంలోనే ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ నిషేధించబడింది. పార్టీ ఆఫీసులనన్నింటినీ సోదాలు చేసి పార్టీకి సంబంధించిన ఆస్తినంతా ప్రభుత్వం వశపర్చుకుంది. అప్పుడు ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ మూడులక్షుల సభ్యులను గల్గియుంది. (మొత్తంజనాభా నాల్గుకోట్లు) పరిమాణంలో ఫ్రెంచి సోషలిస్టుపార్టీకంటె యిదేపెద్దదిగా యుంది. పారిసు నగరప్రాంతాలలో యితరపార్టీలన్నింటికంటె యిదే పెద్దదిగా యుంది. పారిశ్రామిక ప్రాంతాలలో యీ పార్టీ చాలమంచి కార్మికులను అండగా గల్గియుంది.

ఆదినాలలో ఫ్రాన్సులో పట్టణమునిసిపలు కౌన్సిళ్ళలో చాలభాగం కమ్యూనిస్టుపార్టీ మెజారిటీలో యుంది. చాల మంది మేయర్లు కమ్యూనిస్టులు. ఇతర పట్టణాలలోగూడ చాలమంది కమ్యూనిస్టులు కౌన్సిలర్లుగా యున్నారు. అందు వల్ల ప్రభుత్వం తనరెండవదాడిని (మొదటిది కమ్యూనిస్టుపార్టీని నిషేధించుట) యీ మ్యునిసిపాలిటీలపై అములు జరిపింది. మునిసిపాలిటీలలోవున్న కమ్యూనిస్టుల నందరినీ ఒకవైపు జైలులో బంధించుతూ మరియొకవైపు మునిసిపాలిటీలకు

ఎన్నికలు జరపడమే ఆపి తన ఏజంట్లనే పాలకులుగా నియమించింది. ఈవిధంగా లోకలుబోర్డులకుగూడ తమ ప్రతినిధులను పంపుకోకుండా ప్రజలను అరికట్టింది. ఈవిధంగా కొన్ని వేలమంది కమ్యూనిస్టులు తొలగించబడ్డారు. కొన్ని లక్షల ప్రజలు ఏజంట్ల నిరంకుశపాలనకు గురిఅయ్యారు.

పదిహేండ్లక్రితము "కమ్యూనిజమే శత్రువు" అని ప్రకటించిన ఫ్రెంచి రాడికలు మంత్రి 1940 మార్చి 19 తేదిని ఫ్రెంచి సెనేటుకు తానీవిధంగా రిపోర్టు చేశాడు—

"300 కమ్యూనిస్టు మునిసిపలు కౌన్సిల్లు రద్దుచేయబడ్డాయి. జిల్లాల, లేక పట్టణాల కౌన్సిళ్ళకు ఎన్నుకోబడ్డ మొత్తం 2778 మంది కమ్యూనిస్టులు వారిస్థానాలనుండి తొలగించబడ్డారు. కమ్యూనిష్టుపార్టీకి సంబంధించిన 443 ప్రజాసంస్థలపై చర్యతీసుకోబడింది. వరుసగా అయిదులక్షలు, రెండున్నరలక్షలు ప్రతులు ప్రచారంగల 'లాహ్యూమనైట్' 'సిసోయర్' అనే రెండు కమ్యూనిస్టు వార్తాపత్రికలు నిషేధించబడ్డాయి. ఇంకా 159 ఇతర చిన్నపత్రికలుగూడ నిషేధించడమయింది. ఇక కమ్యూనిజానికి ఒక వేదికగాని, ఒక ప్రెస్సుగాని లేకుండా చేయబడింది. 629 కార్మిక సంఘాలు రద్దుగావించ బడినాయి. అవి మరలా తలఎత్తకుండా వుండేందుకు అవసరచర్యలు తీసికోవడమయింది: కమ్యూనిస్టు సమావేశాల కుపయోగపడుతూన్న 11 వేల స్థలాలు సోదా చేయబడ్డాయి. కమ్యూనిస్టుల పలుకుబడిగల్గిన 675 యితర రాజకీయముఠాలు నిషేధించబడినాయి. విదేశ గూఢచారుల నందరినీ యింటర్ను చేయడమో, కాన్సెన్ట్రేషన్ కాంపులకు బంపడమో జరిగింది. 1340 మార్చి 7 వ తేదీకి 3400 కమ్యూనిస్టులు అరెస్టు చేయబడ్డారు. ప్రస్తుతం 8,000 మంది కమ్యూనిస్టులను అరెస్టు చేయవలసిందిగా ఆర్డర్లు పంపడమయింది."

ఈపై నివేదికనుబట్టే ఫ్రెంచి పాలకవర్గం కార్మికుల పట్ల అవలంబించిన పంథా తెలుస్తుంది. అంతకంటే విచిత్రం,

యీ దాడులు అరెస్టులు, అన్నీగూడ కమ్యూనిస్టులు, యుద్ధ వ్యతిరేకులు, హిట్లరుకు అనుకూలురు, పిరికిపందలు (డిఫీటిస్టులు) అయినందుచే జరిగాయట. ఇంతకంటె మోసం యింకా యుంటుందా? ఎవరికళ్లు కప్పాలని యీ తప్పుడు ప్రకటన? ఏమాత్రం ఆలోచించినా యుద్ధప్రారంభపు దినాలనుండీ గూడ ఫ్రెంచిపాలక వర్గమే యుద్ధవ్యతిరేక పంథాలను అవలంబించిందని, హిట్లరుకు అనుకూల పంథాలను గల్గియున్నదని, ప్రతివిషయంలోనూ ఓడిపోయే (డిఫీటిస్టు) ధోరణిని గల్గియున్నదని, సులభంగా గ్రహించవచ్చు. ఫ్రెంచి రిపబ్లిక్కును హిట్లరుకు అమ్మివేసే విధానం ఫ్రెంచి పాలకవర్గం అవలంబించింది. జర్మనీదాడినుండి చివర మనిషిలో ప్రాణముండేంత వరకుగూడ పారిసును రక్షించుతామని అధికారీత్యా ఎన్నో ప్రకటనలు గావించిన ప్రభుత్వం పారిసును రక్షించుటకు ఎందుకు తయారుగాలేదు? ప్రభుత్వానికి తెలుసు పారిసును రక్షించడానికి పూనుకుంటే కార్మికవర్గం, ప్రజాసామాన్యం ఏకమయి జర్మనీని చావగొడుతుందనీ—వెంటనే అధికారం గూడ హస్తగతంజేసి కుంటుందనీ. తెలిసే కార్మిక పాలనకన్నా హిట్లరు నాజీ రాక్షసపాలననే ఫ్రెంచి పాలకవర్గం ఆహ్వానించింది. ఈధోరణి అంతా (7 వ అధ్యాయంలో నిరూపించినట్లు) బోనెట్‌కు, జర్మను రాయబారికి జరిగిన సంభాషణవల్లే విశదమౌతుంది. కమ్యూనిస్టుపార్టీని, కార్మిక సంఘాలను అలా నిషేధించకుండా, కమ్యూనిస్టులను యితర ప్రజానాయకులను అరెస్టు చేయకుండావుండి, తాము ప్రకటించినట్లు

నిజంగా ప్రజాస్వామ్యం కొరకే ఫ్రెంచి పాలకవర్గము జర్మనీతో యుద్ధానికి పూనుకొనియుంటె హిట్లరు ఎన్నడో పరాజయం పొందేవాడు. ఫ్రాన్సుచరిత్రే వేరొకవిధంగా యుండేది. అంతర్జాతీయ పరిస్థితులు వేరొకరూపం దాల్చియుండేవి.

## ప్రజాస్వామ్యాన్ని రూపుమాపడం.

కార్మికవర్గాన్ని అణచుటకు ఫ్రెంచి పాలకవర్గం అవలంభించిన విధానం చూచినపిమ్మట ఫ్రెంచిపార్లమెంటు పరిస్థితులుగూడ తెలుసుకోవాలి. కమ్యూనిస్టుపార్టీని నిషేధించిన కారణాన, కమ్యూనిస్టులు 'కార్మిక కర్షకసంఘము'ను ఒకదానిని ఏర్పరచి ఫ్రెంచి పార్లమెంటుకు ప్రతినిధులను యీ పార్టీనుండి పంపారు. ఫ్రెంచి పాలకవర్గం అలాంటి కమ్యూనిస్టు డెప్యూటీలపైన ఏవోవో కుట్రలు పన్ని 'క్రిమినలు కేసులుపెట్టి' అరెస్టుచేయడం ప్రారంభించింది (ప్రస్తుతం ఒరిస్సాలోవలె). కార్మికకర్షక పార్టీనుండి ఫ్రెంచి పార్లమెంటుకు ప్రతినిధులుగా వచ్చిన యీ కమ్యూనిస్టు డెప్యూటీలు, ఫ్రెంచి ఛాంబరు రహస్యంగా సమావేశమయి యుద్ధము, శాంతి-విషయాలపైన చర్చించాలని కోరారు. అందువల్ల ప్రభుత్వం వీరిపై క్రిమినలు చర్యల నవలంబించింది. అదేసమయంలో ఇంగ్లండులోగూడ బ్రిటిషు పార్లమెంటును రహస్యంగా సమావేశ పర్చవలసిందని లాయడ్‌జార్జి కోరినప్పుడు బ్రిటిషు పార్లమెంటు అందుల కంగీకరించింది. ఈ విషయము ఫ్రెంచి ప్రతికలలో ప్రకటించలేదు. ఫ్రెంచి కమ్యూనిస్టులకు పార్లమెంటులో ఎట్టిస్థానం లేకుండా చేయా

లనే అనేక పన్నాగాలు పన్నుతూన్న ప్రభుత్వానికి యీ వార్త నిషేధించడంలో వింతలేదు. వారినందరిని ఫ్రెంచి ఛాంబరునుండి తొలగించడమే గాకుండా దొరికిన కమ్యూనిస్టు డెప్యుటీని ప్రతివానిని అరెస్టు గావించింది. ఈ డెప్యుటీలలో ఒకడునూ, ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ సెక్రటరీ యగు మారిసుథోరే ఎచ్చట వున్నదీ తెలియని కారణంచేత అతడు జర్మనీలో వున్నాడని కొన్నిపత్రికలు పచ్చిఅబద్ధపు వార్తలు ప్రకటించినందుకు ఆ పత్రికలకు ధనసాయంగూడ చేసింది. (ఫ్రాన్సు పతనానంతరంగూడ మారిస్ థోరే ఫ్రెంచి కార్మికుల నుద్దేశించి రహస్య రేడియో స్టేషనులనుండి రేడియో వుపన్యాసాలుగూడ గావించాడు.)

కార్మికుల సంఘాలపై దాడి.

ఇక కార్మికుల హక్కులను యేవిధంగా రద్దుజేసిందనే చివర అంశాన్నిగూర్చి తెలుసుకుందాం. యుద్ధం ఆరంభమయిన సెప్టెంబరు 3 వ తేదీ ఫ్రెంచి కార్మికులకు సెలవు దినము. కాని ఆసెలవు తుడిచివేయ బడింది. కార్మికులు యికనుండి పనిచేయవలసినది వారానికి 72 గంటలని ఒకచట్టం చేసింది. అంటే పనిచేయవలసిన గంటలు 8% ఎక్కువ చేయబడ్డాయి. నవంబరు 11 తేదేని షాప్‌స్టీవర్డుస్ (*) కమిటీలను ఎన్నుకోగూడదని చట్టంచేశారు. పనిచేయవలసిన గంటలు

(*) ప్రతి పారిశ్రామిక దేశంలోని ఫాక్టరీలలోని శాఖోపశాఖలను షాప్స్ అంటారు. ఫ్రాన్సులో యీ షాప్సులకు సాంకేతిక నాయకులను యీ షాప్సులోని శ్రామికులు తమలోనొకరిని ఎన్నుకునేవారు. వీరిని స్టీవర్డ్సు అంటారు. ఇతరదేశాల్లో వీరిని ఫోర్‌మన్ అంటారు.

మాత్రము విపరీతంగా పెరిగాయి గాని వారి వేతనాలు మాత్రము బహు స్వల్పంగా మాత్రమే పెంచారు. ఇంకా యితర డొంక తిరుగుడు మార్గాలద్వారా వేతనాలు చాల కోసివేశారు. స్త్రీలకు, పిల్లలకు జీతాలు విపరీతంగా తగ్గించారు. ప్రభుత్వపత్రికలు ప్రచురించిన లెక్కల ప్రకారమే ఫ్రాన్సులో జీవిత వ్యయపట్టిక 30 పాళ్లు (పాయింట్లు) లోగడ వున్నదానికంటె మించిపోయింది. నిజానికి యింకా హెచ్చుగానే పెరిగియుంటుంది. ఇక కమ్యూనిస్టుల పలుకుబడి క్రింద వున్న కార్మికసంఘాల నన్నింటినీ రద్దుజేశారు. ఫాసిస్టులచేతులలో కీలుబొమ్మలయిన కార్మిక సంఘాలపట్ల మాత్రము వ్యతిరేకచర్య తీసికోలేదు. కార్మికసంఘాల అఫీసర్ల స్థానాలకు ఖాళీలు ఏర్పడినప్పుడు ఆస్థానాలకు మరల ఎన్నికలు జరుపడం మానివేసి కార్మికమంత్రే ఆస్థానాలకు ఆఫీసర్లను నియమించేలాగున చట్టం చేయబడింది. అంటే కార్మికసంఘాల పౌరసత్వ హక్కులే నాశనం జేయబడ్డాయి. ఫ్రాన్సులో యిలాంటి చర్యలు జరగడం చూచిన తర్వాత, తాముగూడ జాగ్రత్తగా లేకపోతే యుద్ధాన్ని జయప్రదంగా సాగించడానికి అవుసర చర్యలంటూ బ్రిటిషు ప్రభుత్వంగూడ పౌరసత్వ హక్కులను తుడిచివేయ వచ్చునని కొన్ని బ్రిటిషు పత్రికలు హెచ్చరికలు యిచ్చాయి. ఈవిధంగా కార్మికసంఘాలను అణచివేయడంలో ప్రభుత్వానికి, కమ్యూనిజం అంటే భయం, ద్వేషమూగల్గిన ఫ్రెంచి సోషలిస్టుల అండలేకపోలేదు. అందుచేత తమ ప్రభుత్వం ఫ్రాన్సును హిట్లరుకు

అమ్మివేస్తున్నా ఫ్రెంచి కార్మికులు చూస్తూ వూరుకోవలసి వచ్చింది.

## ముసుగులో మోసం.

ప్రభుత్వం కమ్యూనిస్టు డెప్యుటీలను 1940 మార్చి, ఏప్రిల్ నెలల్లో మిలిటరీ కోర్టులలో ఏవిధంగా విచారణ జరిపిందీ చూద్దాము. ఈవిచారణలు ఎలాజరిగిందీ, యాంద్రీ మార్టీ వ్రాసిన 'ఫ్రెంచి కమ్యూనిస్టు డెప్యుటీల విచారణ' అనే గ్రంథం వెలువడేవరకూ ఎవ్వరికీ తెలియదు.

1939 అక్టోబరు మొదటి తేదీని ఫ్రెంచి చాంబరులో సభ్యులయిన 44 గురు కమ్యూనిస్టు డెప్యుటీలు స్పీకరయిన ఎడ్వార్డు హీరియట్‌కు ఒక లేఖ పంపారు. ఆలేఖలో వారు 'యుద్ధము_శాంతి' విషయాలపై చర్చించుటకు పార్లమెంటును రహస్య సమావేశం జరిపించ వలసిందిగా కోరారు. ఆ కారణంచేత యీ 44 గురు అరెస్టు గావించబడ్డారు. చట్ట సమ్మతంగా చూచినాగూడ ఏడెప్యుటీపై తన అభిప్రాయాన్ని వెలిబుచ్చినందుకుగాని, ఓటును తన యిచ్ఛవచ్చినరీతిని విని యోగించు కున్నాగాని, యెలాంటిచర్య తీసుకోగూడదు. ఆ చట్టాన్నే కాలదన్ని ఫ్రెంచి ప్రభుత్వం వీరిని అరెస్టుచేసింది. సాధారణ ఖైదీలవలెనే దాదాపు అయిదు మాసాలు జయిలులో నిర్బంధించింది. రాచకీయ ఖైదీలకు చట్టసమ్మతంగా కలుగజేయవలసిన సౌకర్యాలనుగూడ నిరాకరించింది. తుదకు విచారణకు తీసుకురాబడ్డారు. వారిమీాద యీ క్రిందినేరం మోపబడింది___

"కార్మిక కర్షకపార్టీ అనే గ్రూపును స్థాపించి ఛాంబరులో పాల్గొంటూ అక్టోబరు మొదటి తేదీని డెప్యూటీ ఛాంబరు అధ్యక్షునికి ఒక లేఖ పంపారనీ, ఆ లేఖలో సోవియట్ యూనియను ఆధ్వర్యాన క్రాంతి నేర్పరచే అభిప్రాయాలున్నాయనీ, యింకా వీరు మూడవ అంతర్జాతీయ కమ్యూనిస్టు మహాసభకు భాగాలయిన పార్టీలలోచేరి ఆ నినాదాలే యిచట ప్రచారం చేస్తున్నారనీ" ఆఛార్జిషీటుయొక్క సారాంశము.

ప్రభుత్వం ఆరోపించిన మొదటిరెండు నేరాలను విచారించే అవుసరమే లేదు. ఎందువల్లనంటే కార్మిక — కర్షకులపార్టీని ఏర్పరుచుకోడం వారిస్వేచ్ఛపైనే ఆధారపడి యుంది. హీరియట్ అంగీకరించినట్లే అదిన్యాయము, చట్టసమ్మతము ఇక రెండవది, వారు పంపిన లేఖలోని అభిప్రాయాలు. 1875 నిర్మాణచట్టం 13 షరతు ప్రకారం అదిగూడ చట్టవిరుద్ధముగాదు. ఇక మూడవది, కమ్యూనిస్టు (యింటర్నేషనలు)తో వీరికి సంబంధంవుందనే నెపం ఒక్కటే.

అయితే యీ విషయంలో వీరిని నేరస్తులుగా ఎంచడానికి ఆధారం పారిసు కమ్యూనును రక్తపాతంలో ముంచిన థైర్సు జరిపిన కేసులనుండి సంగ్రహించబడింది. పార్లమెంటరీ విచారణసంఘము ఎదుట పారిసు కమ్యూనును తాను ఓడించుటనుగూర్చి థైర్సు యిలా చెప్పాడట—

"మార్క్సు-ఎంగిల్సులు స్థాపించి, నాయకత్వం వహించినటువంటిన్నీ, యూరపు, ఉత్తర అమెరికా, బ్రిటను కార్మికుల ప్రతినిధులను గల్గియున్నటువంటిన్నీ, కార్మిక ఆశయాలకొరకే పనిచేయునటువంటిన్నీ ఒక అంతర్జాతీయసభ వుండుటే నేరము. అలాంటి అంతర్జాతీయ పార్టీతో కలపబడిన సంఘాలలో సభ్యులుగాచేరడం నేరమని భావించినవారిలో మొదటివాడను నేనే. ఈ నేరాన్ని యికనుండి క్రిమినలు చట్టాలలో క్రొత్తదిగా చేర్చవలసి యుంటుంది."

1872 లోని యీ థైరుస్ కేసును ఆధారంగా దీసికొని మొదట దలాదీరుప్రభుత్వం, తర్వాత రేనాడ్ ప్రభుత్వం యీ కేసు విచారణ ప్రారంభించినాయి. ఎలాంటి కేసు లయినా బహిరంగంగానే విచారణలు జరపాలని చట్టంలోవున్న ప్పటికీ ఫ్రెంచి ప్రభుత్వం వీరి కేసును రహస్యంగా విచారించ పూనుకుంది. ఈ విషయంలో ఫ్రెంచిప్రభుత్వం, అంతవరకూ హిట్లరుగాని మరెవ్వరూగాని చేయనటువంటి దుర్మార్గానికి తయారయింది. ఇది యుద్ధసమయం గాబట్టి యీ కేసును రహస్యంగా విచారించవలసి వచ్చిందని న్యాయమూర్తి వాదించినా గత యేయుద్ధకాలంనాటి కేసుగూడ బహిరంగంగానే విచారించబడినాయని మనమెరుగుదుం. కేసు విచారణ సమయాలలో దగ్గరవుండిన కొలదిమంది విదేశ బారిస్టర్లలో ఒకడయిన ఇంగ్లీషున్యాయవాది 1940 మేనెల 'పౌరసత్వ హక్కులు' అనే సంచికలో ఆకేసునుగూర్చిన వివరాలు యీ క్రిందివిధంగా ప్రకటించాడు—

"ఈ కేసు విచారణ మొదట మొదట బహిరంగంగా ఆరంభించబడింది. అప్పుడు దలాదీరు, బోనెట్, హీరియట్ మొదలగు వారిని డిఫెన్సు పక్షాన సాక్షులుగా పిలువాలా? లేదా? అనే విషయంపై చర్చజరిగింది. హీరియట్ యొక్క సాక్ష్యము చాల ముఖ్యమే అయినప్పటికీ అతను ఛాంబరుకు అధ్యక్షుడగుటవలన అతని సాక్ష్యము వదలివేయాలనీ, 1812 చట్టరీత్యా మంత్రులసాక్ష్యం పనికిరాదనీ మొత్తంమీద ముగ్గురినీ మినహాయించారు. దానికి తోడు కేసు విచారణ ప్రారంభమయిన రోజునే దలాదీరు ప్రభుత్వం రాజీనామా యిచ్చింది. బోనెట్ విదేశాంగ మంత్రిపదవి గూడ వూడిపోయిందిగాన యిప్పుడు అతని సాక్ష్యము పనికి వస్తుంది. కాని తాను ఆరోజున కోర్టుకు హాజరుగాలేని స్థితిలో వున్నా

వని చెప్పి అతను తప్పించుకున్నాడు. [ఆ మనుసటిదినమే బోనెట్ రాడికలుపార్టీ సమావేశంలో వుపన్యసించాడు.] ఈ చర్చతో మొదటి సమావేశం ముగిసింది.

ఇక రెండవసమావేశం రహస్యంగా ఆరంభించబడింది. కారణం ప్రభుత్వానికి సంబంధించిన రహస్యాలు యేమైన వున్నాయనిగాదు గాని యీ విచారణలను గురించిన వివరాలు ప్రజలకు తెలిస్తే ప్రమాదం అనే భయంవల్లనే. అంతేగాకుండా యీ కేసునుగూర్చిన వార్తలను పత్రికలలో ప్రచురించనీయలేదు. మొత్తంమీద ప్రాసిక్యూషన్ తరపు సాక్ష్యాలలో యీముద్దాయీలకు మూడవ అంతర్జాతీయకమ్యూనిస్టు మహాసభకు సంబంధం వుందని ఒక్క సాక్ష్యంగూడ ఋజువుచేయలేక పోయింది. అయినాసరే యీ 44 గురిలోనూ 36 గురిని అయిదేండ్లవరకూ కఠినశిక్షలు విధించింది. తతిమ్మావారిని యింటర్న్ చేసింది. ఈ కేసు విచారణసందర్భాలలో ప్రభుత్వం, వారికి విధించవలసిన శిక్షలనుగూర్చిగాకుండా యీ విచారణకు సంబంధించిన యేవిషయాలను ప్రజలకు తెలియకుండా వుండేందుకే యెక్కువ శ్రద్ధవహించింది.”

ఈ సందర్భంలోనే ఆ 44 గురు డెప్యూటీలలో ఒకరయిన బిల్లౌక్స్ యిచ్చిన స్టేటుమెంటును తప్పక చూడవలసియుంటుంది. అది యీ క్రిందివిధంగావుంది.—

“కమ్యూనిస్టు డెప్యూటీలుగాని లేక కమ్యూనిజంగాని యిచ్చట విచారించబడుటలేదు. అరెస్టుచేయబడి కోర్టులలో యీ విధంగా హేళనకు గురిఅయిన కమ్యూనిస్టు డెప్యూటీలను ఖండించగల న్యాయసూత్రం పెట్టుబడిదారుల హక్కులను రక్షించుటకే, వారిచేతనే తయారుచేయబడిన చట్టాలలో ఒక్కటీ దొరకదు. మానవసమాజ చరిత్ర చూచినట్లయితే అధికారవర్గాలు తాము సృష్టించిన న్యాయసూత్రాలనే కాలదన్నిన ఘట్టాలు కన్పించుతాయి. ఫ్రాన్స్ చరిత్రలోనే అలాంటిదశలు గడచాయనీ, యింకా ప్రజాసామాన్యం విప్లవమార్గాలద్వారా యిలాంటి రాక్షసకృత్యాలను ఎప్పుడో ఒకప్పుడు తప్పక అంతమొందింపతుందనీ మే మెరుగుదుం.”

తర్వాత బిల్లాక్సు ఫ్రెంచి ప్రభుత్వంయొక్క స్వదేశ విదేశాంగ నీతులనుగూర్చి వుపన్యసించిన పిమ్మట తనపార్టీ పాలసీని యీ క్రిందివిధంగా సమర్థించాడు—

"ప్రపంచశాంతిని అంతర్జాతీయ ఫాసిజం భగ్నపరచనున్నదని చెప్పినవారిలో యీ దేశంలో మేమే మొదటివారము. ఎంతో శ్రద్ధతో హిట్లరిజాన్ని ఫ్రెంచి ప్రజలకు బట్టబయలుచేసింది మేమే. అలాంటి అవినీతికరమయిన ఫాసిజాన్ని రూపుమాపడానికి యుద్ధమే మార్గమని మేమెన్నడూ బోధించలేదు. జర్మనీప్రజలకు స్వాతంత్ర్యం కావాలంటే ఆ దేశ ప్రజలపైనే ఆధారపడియుందని మేమెల్లప్పుడూ బోధించుతూవచ్చాము. అయినప్పటికీ యీ దేశంలో ఫాసిజంస్థాపించాలని ప్రయత్నించేవారికి వ్యతిరేకంగా ప్రజాశక్తులను సంఘటితపర్చసాగింది మేమే. శాంతిని, ఫ్రెంచి స్వాతంత్ర్యాన్ని కాపాడాలంటే యూరపులోని ప్రజాశక్తుల నన్నింటినీ కూడదీసి ఫాసిజాన్ని వ్యతిరేకించవలసిందిగానూ, లేనియెడల రానున్న యుద్ధానికి బాధ్యతరాలవు నీవేననీ మేము ఫ్రెంచిప్రభుత్వానికి చాలకాలం క్రితంనుండీ హెచ్చరికలు యిస్తూవచ్చాము.

ఈ యుద్ధాన్ని రాకుండాచేయడానికి మీరు యేమీ యిష్టము చూపనందున మేమీ యుద్ధానికి గర్భశత్రువులము. ఈ యుద్ధం ప్రపంచానికంతటికీ ప్రాకే అవకాశాలున్నాయి. ఎందువల్లనంటే మీరు శాంతి, చిన్నదేశాల స్వాతంత్రం కంటె పెట్టుబడిదారీ వర్గహక్కులను రక్షించుకోవడమే విధిగా తలంచారు గాబట్టి దానిఫలితమే నేడు యూరపునకంతా ప్రాకుచున్న యీ యుద్ధం. అసలు పెట్టుబడిదారీ పరిపాలనే యుద్ధాలకు కారణం. సోషలిస్టుపార్టీ వారి అండవున్నది గాబట్టి తాము చిరకాలమూ యీ విధంగా ప్రజలను మోసగించవచ్చునని పెట్టుబడిదారులు తలంచుచుండవచ్చు. మేము అంతర్జాతీయవాదులము. మేమే నిజమైన అంతర్జాతీయ వాదులము. జాతులు, మతములు, రంగులు వేరైనప్పటికీ కష్టజీవులందరూ మా సోదరులు. ఇంగ్లండులోని గనుల, నావికా, యంత్రాల పనివారు, ఎస్సెన్‌లోని లోహపుపనివారు, హాంబర్గులోని నౌకానిర్మాణాల కూలీలు, ప్రేగు కార్మికులు, పోలెండురైతులు, అరేబియా ప్రజలు,

నైనా కూలీలు, రష్యాలోని స్వతంత్ర కార్మిక కర్షకులు, యింకా యింకా యితరదేశాల కష్టజీవుల ఆశయాలకు మా ఆశయాలకు భేదం విమాత్రమూ లేదు.''

తదుపరి కారల్ లిబ్నెక్టు 1914-18 యుద్ధకాలంలో జర్మనీ ప్రభుత్వంచే అరెస్టు చేయబడినప్పుడు యిచ్చిన వాఙ్మూలం, జార్జి డిమిట్రాఫ్ 1933 లో యిచ్చిన వాఙ్మూలం (స్టేట్‌మెంటును) జ్ఞప్తికి దెచ్చుకొని బిల్లాక్సు ఉద్రేకంతో తన ఉపన్యాసాన్ని యీ క్రింది మాటలతో ముగించాడు—

"హిట్లరుకు బానిసలుగాగాని, ఛాంబర్లేనుకు కీలుబొమ్మలుగాగాని, ముసోలినీకి నౌకర్లుగాగాని వుండడానికి మేమంగీకరించం.

ఫ్రెంచి ప్రజలంటే సంపూర్ణ విశ్వాసముంది. ఫ్రెంచి ప్రజలను నాశనం చేయదలంచుకున్న శత్రువులబారినుండి వారిని రక్షించడానికే మేము కోరుతాము. ప్రజలను-తమకు శాంతి, తిండి, స్వాతంత్ర్యాల కోసమే పోరాడవలసిందిగా కమ్యూనిస్టులమైన మేము కోరుతాము.

మేము కమ్యూనిస్టులమన్న సంగతి నిజము. ఆత్మత్యాగానికైనా ఓర్చి ఫ్రెంచి రిపబ్లిక్కును రక్షించిన, కార్మికోద్ధరణకే పోరాడి మరణించి నటువంటి ఆ కమ్యూనార్డులకు వారసుల మయినందుకు మేము గర్వపడ తాము. కారల్ మార్క్సు "వారు స్వర్గాన్నే వూగించి వేశారు" అన్నాడు.

కమ్యూనిజం అంటే శాంతి, మానవాభ్యుదయం, శాస్త్రము, కళలు వృద్ధి జెందడం, యింకా మానవ నాగరికతే వికసించడమన్నమాట. మేము ఫ్రెంచి జాతివారమగుటవల్ల సంతోషంగానూ, బలంగానూ, స్వతంత్రం గానూ వున్న ఫ్రెంచిదేశాన్ని చూడాలనే మేము హృదయపూర్వకంగా కోరుతాం. మేము అంతర్జాతీయ వాదుల మవడంవల్ల ఏ దేశంలోని కార్మిక వర్గం గెలుపొందినా ఆ గెలుపు మాదిగానే భావిస్తాం.

దోపిడీ విధానాన్నుండి, యుద్ధాలనుండి రక్షించేటటువంటి ప్రపంచ

విప్లవం చేసిన పనులలో మొదటిది రష్యాలో సోషలిజం స్థాపించడమేనని మేము నమ్ముతాం.

1793, 1830, 1848, 1871, 1934 ఫిబ్రవరి, 1936 మే కాలాలనాటి ఫ్రాన్సు దేశంలో మాకు సంపూర్ణ విశ్వాసముంది "

1940 ఏప్రిలు 3 వ తేదీతో యీ కేసు అంతమయింది. ఆరుదినములు పిమ్మట ఫ్రాన్సులో కొత్తచట్టము ఒకటి తయారు చేయబడింది. ఫ్రెంచి దేశస్థులు ఎవరైనా, బహిరంగంగాగాని రహస్యంగాగాని, యుద్ధ ప్రయత్నాలకు ఆటంకం గల్గించే చర్యలు చేసినా, అలాంటి ప్రచారంచేసినా, అంటే కమ్యూనిస్టు ప్రచారంగాని, హిట్లరుకు అనుకూల ప్రచారంగాని చేసినట్లయితే ఉరిశిక్ష విధించ బడుతుందని ఆ చట్టంయొక్క సారాంశం. మరియొక చట్టముగూడ చేయబడింది. దానిప్రకారము కమ్యూనిస్టు ప్రచారానికి పనికివచ్చు పనిముట్లు తయారు చేస్తున్నా, నిల్వవుంచినా, యితరులకు పంచుతున్నాగూడ ఉరిశిక్ష విధించబడుతుంది. ఈ చట్టముల ప్రకారం ఎవరివద్దయినా ఒకచిన్న కమ్యూనిస్టు కరపత్రమున్నట్లయితే ప్రభుత్వం అతనికి ఉరిశిక్ష విధించుతుంది.

బ్రిటనులో ఏదైనా కర్మాగారాలలో కమ్యూనిస్టు కరపత్రములు పంచితే అతనిని ఉద్యోగంనుంచి తొలగిస్తారు. (డిస్మిసు చేస్తారు.) అది 'కాపాడబడిన స్థలం' అయితే జరిమానా వేయడమో శిక్షవిధించడమో జరుగుతుంది. బ్రిటనులో ఎవరైననూ కమ్యూనిస్టు కాగితాలను గల్గియుండడం (అలాంటి కాగితాలను పోలీసులుచూచి దిగ్భ్రమ జెంద

వచ్చునేమోగాని) నేరంకాదు. అలాంటిదాన్ని ఫ్రాన్సులో పురిశిక్షకు గురిచేస్తారు.

కార్మికుల జీతాలను గూర్చిగాని, వారి స్థితిగతులను గూర్చిగాని, తినుబండారపు వస్తువుల ధరలను గూర్చిగాని, యజమానులు గుంజే అధిక లాభాలనుగూర్చి భోగట్టా తీసుకోవడంగూడ పై చట్టములో "తయారు చేస్తున్నా" అనే క్లాజుకు వర్తిస్తుంది. ఆ చట్టము అంత క్రూరమయింది గాబట్టే బ్రిటనులోగూడ ఆచట్టానికి వెంటనే అసమ్మతి తెలుపబడింది. బెర్నార్డుషా, హెచ్. జి. వెల్సు, ఇ. యమ్. ఫార్స్టర్ మున్నగు ప్రముఖులు మొత్తం 25 గురు యీ క్రింది స్టేట్‌మెంటును పత్రికలకు పంపించారు—

"ఫ్రెంచి పాలకవర్గం 'కమ్యూనిస్టు ప్రచారం చేసినందుకు పురిశిక్ష విధించబడుతుంది' అనిచేసిన చట్టానికి మేము తీవ్ర అసమ్మతిని తెలియజేస్తున్నాం. తాము ఏ ఆశయాలకు యీ యుద్ధాన్ని సాగించుతున్నామని చెప్పుచున్నారో ఆ ఆశయాలకు—తామవలంబించే నిర్బంధ విధానాలకు యిదివరకేవున్న అఖాతాన్ని మరలా యీ ప్రయత్నాలద్వారా అధికం జేయడంవల్ల ప్రయోజనంలేదు. ఈ నాజీజంగాని, యీ క్రూర నిరంకుశత్వంగాని ప్రపంచాన్ని రక్షించలేవనే మానిర్ణయం. ఈ చట్టము బ్రిటిషు ప్రజలను ఎంతగా ఆందోళన పరుస్తూందో ఫ్రెంచి ప్రభుత్వం గ్రహించాలని మేము కోరుచున్నాము. ఈ చట్టాన్ని రద్దుగావించేందుకు బ్రిటిషు ప్రభుత్వం ఫ్రెంచి ప్రభుత్వంపై ఎక్కువ ఒత్తిడి చేయాలనిగూడ మా కోరిక."

కాబట్టి గత కొద్దియేండ్ల ఫ్రాన్సుచరిత్ర చూచినప్పుడు ఫ్రెంచి ప్రభుత్వం అవలంబించిన యీ నిరంకుశత్వం కార్మికుల, ప్రజలందరియొక్క పౌరసత్వహక్కులు యెంత నిర్బం

ధంగా అణచివేసింది చూచినప్పుడు, ఫ్రాన్సు ఓడిపోయిం దంటే ఆశ్చర్యం గలుగవలసిన అవసరంలేదు. మొదటినుండీ గూడ దలాదీర్-బోనెట్ ప్రభుత్వం బ్రిటిషు రాజకీయవేత్త లను, ఫ్రాన్సులోని పరిస్థితులన్నీ చాల సక్రమంగా వున్నా యని చెప్పుతూ, కళ్లుగప్పుతూ వచ్చింది. ఫ్రాన్సులోని యీ కుళ్లునంతా యేమాత్రమూ బయటకు కన్పించనీయకుండా వుండడంలో దలాదీరు ప్రభుత్వం అందెవేసిన చేయి అని పించుకుంది.

ఫ్రాన్సుదేశం మొదటినుండీగూడ సైన్యాన్ని సమీ కరణ చేయలేదు. ఫ్రెంచి సైనికుల స్థితిగతులు చాల అన్యా యంగావుండేవి. తన విదేశాంగనీతి బ్రిటను, ఫ్రాన్సులు ఐరోపా నాయకత్వం వహించాలనీ, సోవియట్ మీాద జర్మనీచే యుద్ధం ఆరంభింప జేయాలనీ వుండేది. ఫిన్లండు విషయంలో సోవియట్పై చర్యతీసుకోడానికి 'నానాజాతి సమితి' ని సమావేశ పర్చాలని దలాదీరుగూడ ఛాంబర్లేనుతో తాళం వేశాడు. ఫిబ్రవరిలో తాను జర్మనీని ఎదుర్కోవలసి వస్తుం దనే విషయాన్నే మరచిపోయి ఎఱ్ఱసైన్యాన్నే ఎదుర్కో డానికి లక్ష (ఆంగ్లో-ఫ్రెంచి సైన్యాన్ని) ఫిన్లండుకు పంప డానికి నిర్ణయించుకున్నాడు.

కాని యింతలో జర్మనీ నార్వే, డెన్మార్కులను కబ ళించి వేసింది. ఈ ఘటనలవల్ల ఇంగ్లండులో ఛాంబర్లేను ప్రభుత్వం పడిపోయింది. ఫిన్లండు ఘటనలవల్ల దలాదీరు ప్రభుత్వం అస్తమించింది. ఇక ఫ్రాన్సులో అభివృద్ధి నిరోధక

శత్రువులు గుమిగూడి ఆలోచించ సాగాయి. కాని ఫ్రాన్సును అప్పుడే హిట్లరుకు అమ్మివేయడానికిగాని, హిట్లరుతో రాయబారాలు జరిపేముందు ఫ్రెంచి అధికారాన్ని అప్పగించడానికిగాని పరిస్థితులు యింకా పక్వంగాలేవు. మరలా రేనాడ్ ప్రభుత్వం సింహాసన మలంకరించింది. దలాదీరుగూడ యీ ప్రభుత్వంలో యుద్ధమంత్రిగా వున్నాడు.



లియన్ బ్లమ్

# 9. దాడి - గందరగోళం

1940 మే 10 వ తేదీ వుదయం 3 గంటలవేళ జర్మను విమానాలు, కాల్బలము నెదర్లాండ్సు, బెల్జియం, లగ్జంబర్గుల మీద దాడిజరిపాయి. ఈ దాడికి గురిఅయిన దేశాలు మిత్రమండలి సాయంకోరినాయి. మిత్రమండలి వాటికి సాయము చేస్తానని లోగడే ప్రకటించింది. మే 7, 8 తేదీలలో బ్రిటిషు పార్లమెంటులో నార్వేదేశంపై వచ్చిన చర్చ ఫలితంగా 10 వ తేదీని ఛాంబర్లేను రాజీనామా యీయడం జరిగింది. కొలదిగంటలలోనే హాలెండులో చాలభాగము జర్మనీ సేనలు ఆక్రమించాయి. మే 14 తేదీని డచ్చి సర్వసైన్యాధ్యక్షుడగు జనరలు వింకెల్ హెల్మన్ లొంగిపోయాడు. ఈలోగా బెల్జియములో బ్రిటను, ఫ్రెంచి, బెల్జియం సేనల కూటమిని ఓడించుతూ జర్మనుసేనలు ముందుకు చొచ్చుకొని పోతూన్నాయి.

మే 18 న ఫ్రాన్సులో రేనాడ్ విదేశాంగ మంత్రిగా వచ్చాడు. [దలాదీరు ప్రభుత్వం 22 నెలలు పాలించి ఫ్రెంచి ఛాంబరులోని వ్యతిరేక అభిప్రాయాల మూలంగా మార్చి 20 నే రాజీనామా యిచ్చిందని గుర్తుంచుకోవాలి.] లోగడ ఆర్థికమంత్రిగా వున్న పాల్ రేనాడ్ యిప్పుడు ప్రధానమంత్రి, విదేశాంగమంత్రి అయాడు. కొన్నినెలలు న్యాయశాఖా మంత్రిగావున్న బోనెట్ యిప్పుడు ప్రభుత్వంలో లేకుండానే

పోయారు. కాని రేనాడ్‌కు ఛాంబరులో బలంలేకపోయింది. బలం చేకూర్చుకోడానికి అతివాదముతాలనో లేక మితవాద ముతాలలో దగ్గరకు తీసికోవలసివచ్చింది. ఆ కారణంచేత రేనాడ్ మితవాదముతాల సాయమే కోరాడు. తాత్కాలికంగా అతనిని ఉపయోగించుకొని తర్వాత వ్రాడబీకవచ్చుననే తలంపుతో మితవాదులు రేనాడ్‌ను బలపర్చారు. మిత్రమండలి రాజ్యాలు రేనాడ్ నాజీలకు గర్భశత్రువనే తలంపుతో అతనిని ప్రధానిగా బలపర్చాయి. ఏమైనప్పటికి నాజీలపలుకుబడి రేనాడ్‌పై బడక తప్పిందిగాదు. అతనిభార్య పంచమదళానికి చెందినది. డబ్బు సంపాదించుటలో మిక్కిలి తెలివితేటలు గల్గినటువంటిది. రానురాను ఆమె నాజీ గూఢచారులలో ముఖ్యపాత్రవహించింది. ఈమె రేనాడ్‌ను పూర్తిగా మార్చివేయగల్గింది. దానితో, విషమపరిస్థితులలో రేనాడ్ క్రొత్తశక్తులను దగ్గరకుదీయ ప్రారంభించాడు. 84 ఏండ్ల ముసలివాడైన మార్షలుపిటేన్ వైస్ ప్రీమియరు, దేశాంగా మంత్రిగా నియమింపబడ్డాడు. 76 ఏండ్ల వృద్ధుడు జనరలు వేంగాడును మే 20 న గా మెలిన్ స్థానే సర్వసైన్యాధ్యక్షుడుగా నియమించారు.

బలహీనంగావున్న చోట్ల ఫ్రెంచి సేనలను వెనుకకు తరిమి జర్మనీసేనలు ఫ్రెంచి సరిహద్దులనుదాటి లోన ప్రవేశించినాయి. పరిస్థితులు తీవ్రరూపం దాల్చినాయి. మే 21 తేదీని రేనాడ్ సెనేటులో యిలాఅన్నాడు — "మ్యూస్‌పైనున్న వంతెనలను మనసేనలు పడగొట్టలేదు. ఇదిక్షమింపరాని

తప్పు." ఈ విధంగా ఫ్రెంచి సైన్యాధ్యక్షులు జర్మనీ సేనలకు అన్నివిధాలా సాయంచేశారు. మందెనలను పడగొట్టకపోవడం, యింకా రహస్యాలను జర్మనీసేనలకు అందించడం మొదలగు పనులు అతిసులభంగా జరిగాయి.

1916 లో 'వెర్డన్ రక్షకుడు' అని వచ్చినపేరుతో పిటేన్ పైకి వచ్చాడు. అతడు పాప్యులరు ఫ్రంటు ప్రభుత్వానికీ, బ్రిటను పాలసీకిగూడ వ్యతిరేకియని చాలమందికి తెలుసు. ఫ్రాన్సులోని రెండువందల కుటుంబాలచే పోషింపబడే రాచకీయవేత్తఅని చెప్పవచ్చు. పిటేన్ దృష్టిలో ప్రజాస్వామ్య సూత్రాలను నాశనంచేయడమే ముఖ్యం.

ఇక వేగాండు కమ్యూనిజానికి శత్రువని లోకవిదితం. 1920 లోనే ఎర్రసైన్యాన్ని ఎదుర్కోడానికని పోలెండు సైన్యాలకు ప్లానులు యిస్తుండేవాడు. వేగాండు యొక్క సిద్ధాంతం బయటినాజీజాన్ని ఓడించడంకంటె యింట్లోని కమ్యూనిజాన్ని ఓడించడమే ప్రధానవిషయం.

విషమపరిస్థితులలో రేనాడ్ యిలాంటి శక్తులను చేరదీశాడు. అదేసమయంలో ఫ్రెంచిబాంకుకు ఏజంటయిన బడ్లోయిన్ గూడ ప్రభుత్వముఠాలోకి లాగబడ్డాడు. 1937 మే లో పాప్యులరు ఫ్రంటు ప్రణాళికను అమలు జరపడంలో కొంత "వ్యవధి" కావాలని బ్లుం చే పార్లమెంటులో ప్రకటింప జేయుటకు యితడే కారకుడు. ఇటలీ ఫాసిస్టులు యితనిని అమితంగా పొగడుతుండేవారు. బోనెట్ కు—ముసోలినీకి మధ్య యీ బడ్లోయిన్ ద్వారా అనేక రాయబారాలు జరిగినాయి. నాజీ

లకు యితనికి దగ్గరసంబంధంవుంది. జర్మనీదాడి తీవ్రతమవుగు తున్న సమయంలో యితడు జర్మనీకి లొంగిపోవడమే మంచి దని రేనాడుకు మాడమ్ డిఫోర్టసు (రేనాడ్ భార్య) ద్వారా బోధచేయడం ప్రారంభించాడు.

మే 25 న పదిహేనుగురు ఫ్రెంచి జనరల్లను తమ స్థానాలనుండి డిస్మిసుచేశారు. ఈలోగా బ్రిటనుకుగాని, ఫ్రాన్సుకుగాని తెలియజేయకుండానే బెల్జియం సైన్యాధ్య క్షుడు మూడవలియపాల్డు చక్రవర్తి జర్మనీకి లొంగిపోయాడు. మే 28 తేదీని రేనాడ్, లియపాల్డు చర్యను ఖండించుతూ రేడియో వుపన్యాసం గావించాడు.

మే ఆఖరున పారిసులో ఫ్రాన్సుపక్షాన రేనాడ్, పిటేన్, వేగాండ్, డార్లన్, బడోయిన్‌లు, బ్రిటనుతరపున చర్చిలు, అట్లీ, సర్ జాన్‌డిల్లులు సమావేశమయ్యారు. ఆ సమావేశ ఫలితంగా మిత్రమండలి ప్రభుత్వాలు జయం లభించే వరకూగూడ కలసి పోరాడుటకు నిశ్చయించుకున్నారు. ఈ విధంగా బ్రిటను, ఫ్రాన్సులమధ్య సంధిజరిగింది.

ఈలోగా ఫ్లాండర్సులో బ్రిటిషు-ఫ్రెంచిసేనలు జర్మనీ సేనలచే ముట్టడించబడినాయి. జర్మన్లు బౌలోన్, కలేలను పట్టుకున్నారు. ఇక డన్‌కర్కుపైనే అంతా ఆధారపడియుం టుంది. జూన్ మొదటితేదీలలోనే బ్రిటిషు నావికాదళం, పౌరుల చిన్నచిన్నబోటుల సాయంవల్ల బ్రిటిషు సైన్యంలో అధికభాగము రక్షించుకోబడింది. జూన్ మొదటితేదీ నుండి నాల్గవతేదీవరకూ డన్‌కర్కు క్రమేణా ఖాళీచేయబడింది.

జూన్ అయిదవ తేదీని 120 మైళ్ల పొడవున ఎక్కువ డివిజన్లతో జర్మనులు కొత్తదాడి ప్రారంభించారు. జూన్ 6 న రేనాడ్ పాత యుద్ధకమిటీని మార్చి క్రొత్తదానిని ఏర్ప రచాడు. జర్మనుసేనలు క్రమేణా ముందుకు సాగిపోతున్నాయి. పారిసుమీదకు ఒత్తిడివచ్చింది. మంత్రులు పారిసును ఖాళీ చేయడం ఆరంభించారు. జూన్ 9 న పారిసునుండి బోర్డ్రోకు ఫ్రెంచి ప్రభుత్వం మారింది. అచ్చట పారిసును రక్షించుటకు పూనుకోవద్దనే నిర్ణయం జరిగింది. కారణం కమ్యూనిస్టు విప్లవం వస్తుందన్న భయంమాత్రమే. "పారిసులో మారిసు థోరే కార్మికప్రభుత్వాన్ని ఏర్పరచాడట" అనే వదంతి బోర్డ్రోలో వ్యాపించిపోయింది. ఈ వదంతికి యెట్టి ఆధారమూ గూడ లేదునిజంగా. రేనాడ్, తమకు సాయం చేయవలసిందని అమెరికా అధ్యక్షునికి వార్తనంపాడు. దానికి సమాధానం జూన్ 15 తేదీని బోర్డ్రో ప్రభుత్వానికి వచ్చింది. ఫ్రాన్సుకు పరికరాల సాయమంతా చేయబడుతుందిగాని కాంగ్రెసు అంగీకారంలేకుండా మిలిటరీ సాయంచేయుటకు వీలులేదని రూజువెల్టు తెలియపర్చాడు.

ఫ్రాన్సుజర్మనీతో ప్రత్యేకసంధి ఎక్కడ చేసుకుంటుందోననే భయంచేత, అలా ప్రత్యేకసంధి చేసికోవద్దని కోరడానికిగాను ఛర్చిలు ఫ్రాన్సుకు ఎగిరివెళ్లాడు. తదుపరి కొన్నిదినాలకు ఫ్రెంచి ప్రభుత్వం జర్మనీతో ప్రత్యేక సంధి చేసుకునేలోపున ఫ్రెంచి నౌకాదళమంతటినీ సురక్షితంగా బ్రిటిషు దీవులలోకి చేర్చినట్లయితే, ఆసంధికి తామంగీకరించుతామని బ్రిటిషు

ప్రభుత్వం ఫ్రెంచి ప్రభుత్వానికి జవాబుపంపింది. జూన్ 12 నుండి మార్షలుపిటేన్, వేగాన్డ్ యింకా వీరి అనుచరులు గలసి జర్మనీతో ఒడంబడికకు ప్రయత్నించుతున్నారని రూఢి అయింది. ఒకవైపు జర్మనీసేనలు ముందుకుపోతూనే యున్నాయి. జూన్ 16 తేదీని ఫ్రెంచి మంత్రివర్గం రెండుమార్లు సమావేశమయింది. 17 వ తేదీ వేకువనే ప్రధాని రేనాడ్ రాజీనామా పెట్టడం జరిగింది. మార్షలు పిటేన్, ఛాటమ్స్, వేగాన్డ్, బడోయిన్‌లతో నూతన మంత్రివర్గాన్ని ఏర్పరచాడు. కొలదిగంటలలోనే, జూన్ 17 న పిటేన్ యుద్ధవిరామాన్నిగూర్చి ఫ్రెంచి ప్రజలకు యీ క్రింది విధంగా రేడియోవుపన్యాసం గావించాడు—

"మనం యుద్ధంచేయడం ఆపివేయాలని చెప్పడానికి విచారం వేస్తున్నది. యుద్ధాన్ని ఆపవలసిందని, పరస్పర వైరుధ్యాలను తొలగించుకోడానికి మాతోకలసి సంతకాలు చేయవలసిందిగా మనవిరోధులకు వార్త పంపించాను."

వీటన్నింటినీబట్టి ఫ్రాన్స్‌లోని స్పెయిను రాయబారి ద్వారా జర్మనీతో లోగడనుండే రాయబారాలు జరుగుతున్నాయని వెల్లడిఅయిపోయింది. సంధిప్రయత్నాలు జరుగుతున్నా జర్మనీసేనలు ముందుకుపోతూనే యున్నాయి. ఎట్టకేలకు జూన్ 21 తేదీని 1918 నవంబరు 11 న సంధిజరిగిన రైలుబండిలోనే ఫ్రెంచి ప్రభుత్వానికి జర్మనీకి, జూన్ 25 తేదీని ఫ్రెంచి ప్రభుత్వానికి—ఇటలీకి, ఒడంబడికలపై సంతకాలు జరిగాయి—ఫ్రాన్స్‌పతనం పూర్తిఅయింది.

జర్మనీకి ఫ్రెంచి ప్రభుత్వానికి జరిగిన సంధిషరతులను గూర్చి బ్రిటిషు ప్రధాని ఛర్చిలు యిలా ప్రకటించాడు—

"బ్రిటిషు ప్రభుత్వం విచారంతోనూ, ఆశ్చర్యంతోనూ యీ షరతులను వినడమయింది ప్రజాస్వామ్య సూత్రాలచే నడుపబడు యెట్టి ఫ్రెంచి ప్రభుత్వముగూడ అలాంటి షరతులకు అంగీకరించియుండదు."

ఇలాంటి విచారకరమైన ఘట్టాలు జరుగుచున్నప్పుడు ఫ్రెంచిప్రజల స్థితిగతులనుగూడ మనమాలోచించ వలసి యుంటుంది. ఫ్రెంచి పార్లమెంటరీ విధానం సక్రమంగా జరుగుతుండి, ఫ్రాన్సులో అలాంటి సెన్సారుషిప్పు లేకుండా వున్నట్లయితే ఫ్రాన్సు యిట్టిషరతులకు అంగీకరించి యుండే దేనా ? అని హోర్ బెలీషా అడిగినప్రశ్నకు చర్చిలు సమాధానమిస్తూ అట్టిపరిస్థితులలో బ్రిటిష్ పార్లమెంటే వేరొక విధంగా యుండేదనిచెప్పాడు.

అభిప్రాయాలను వెలిబుచ్చుకొనేందుకుగూడ చట్ట రీత్యా అవకాశాలను అణచివేశారు. గాబట్టి ఆ దినాలలో ఫ్రెంచిప్రజల అభిప్రాయాలు, స్థితిగతులు ఏమిటోగూడ తెలిసికోవడం కష్టమే. జూన్ మొదటిదినాలలో ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ రహస్యంగా ఒక ప్రకటనగావించి ఫ్రాన్సులో అన్నిప్రాంతాలలోనూ పంచింది. బ్రిటనులోమాత్రము అది సంధిషరతులపై సంతకములు జరిగేవరకూగూడ ప్రకటింపబడలేదు. ఆప్రకటనలోని విషయాలకు కమ్యూనిజానికి శత్రువులు సయితము అంగీకరిస్తారని నానమ్మకం. ఆ ప్రకటన యీ క్రిందివిధంగాయుంది—

"ఫ్రెంచి ప్రజలు విషాదాంతమైన దినాలు గడుపు తున్నారు. కమ్యూనిస్టుపార్టీ యిలాంటి ఉపద్రవాలు రాకుండా చేయాలని ఎంత ప్రయత్నించినా అవి ఫ్రెంచిప్రజలను ఎదుర్కొన్నాయి. ఫ్రాన్సులో విదేశసైన్యం వచ్చిపడింది. యుద్ధాన్ని బయలుదేరదీసి, ప్రజలను భీభత్సం పాల్గావించి, కోట్లాది కార్మిక కర్షకులను రణరంగంలో గోరీల దాపుకు చేర్చి, యిప్పుడు ఫ్రెంచి సామ్రాజ్యవాదులు ప్రజలకు తెలియకుండా హిట్లరుకు లొంగిపోడానికి ప్రయత్నించుచున్నారు. ఫ్రాన్సు యిక ఒక జాతిగానూ, ఒక స్వతంత్ర దేశంగానూ వుండదనే ప్రమాదాన్ని ఎదుర్కొంటూన్నది........."

ఫ్రెంచి పాలకవర్గంయొక్క దివాలా కోరుతనం, వాళ్ళ పరిపాలన, దగా, రాచకీయవాదులు, అసమర్థులయిన సేనా నాయకులు,—యిలాంటి విషయాలన్నీ కళ్ళకుగట్టినట్లు గన్పించు తున్నాయి. ఫ్రెంచి పాలకుల, సామ్రాజ్యవాదుల దివాలా కోరుతనమే అభివృద్ధి నిరోధకులయిన జర్మను ఫాసిస్టు శక్తులనుమేపి, యిప్పుడు ఆశక్తులు అధికారానికి రావడానికి త్రోవ యిచ్చింది. ఈదివాలాకోరు తనాన్ని ఋజువు చేయడానికి ఆ కరపత్రం అనేక వుదాహరణలను యిచ్చింది. ఫ్రెంచి ప్రజల కోర్కెలకు వ్యతిరేకంగా, శాంతి ఆశయాన్ని గంగలోగల్పి లావల్, ఫ్లాండిన్, దలాదీర్, బోనెట్, బ్లమ్, ప్రభుత్వాలు ప్రపంచ అభివృద్ధి నిరోధక శక్తులను తగురీత్యా బలపర్చారని వ్రాసింది. పై ప్రకటనలోనే యింకా యిలావుంది

"లావలు ప్రభుత్వము 'రోముఒడంబడికను' అంగీకరించి అబిసీనియాను కబళించి వేయడానికి స్వేచ్ఛ యిచ్చింది. ఇప్పుడు ఫాసిస్టు ఇటలీ ఫ్రాన్సుపై దాడిచేయడానికిగూడ మార్గమేర్పరచింది."

"ఫ్లాండిన్ ప్రభుత్వము రైన్ నదికి పశ్చిమదిశను జర్మనీ వారు మిలటరీ చర్యలు అవలంబించుతుంటే మౌనంవహించి జర్మను సామ్రాజ్యవాదాన్ని బలపర్చింది. బ్లమ్ ప్రభుత్వం తటస్థ విధానం అనే ఘాతకచర్య అవలంబించి పెరెనీస్ సరిహద్దుల (స్పెయిన్) కు ప్రమాదాన్ని దెచ్చింది. ఇక దలా దీరు ప్రభుత్వం జకోస్లోవేకియాను జర్మనీకి యిచ్చివేసింది. ఆ విధంగా జెకోస్లోవేకియాకువున్న 40 డివిజన్ల సేనలకుగల 1600 విమానాలు, 500 టాంకులు, యింకా యితర ఆయుధాలను, యిప్పుడు ఫ్రెంచి సోల్జర్లను చిత్రవధ గావించడానికి అర్పించింది. ఇక బోనెట్ వగైరాలు సోవియట్ ఫ్రాంకో పరస్పర సహాయపు టొడంబడికను క్రమం తప్పకుండా నాశనం జేశారు. వీరే—యీ పైవారంతాగూడ—యీ సామ్రాజ్యవాద యుద్ధానికి ప్రధానకారకులు."

ఫ్రెంచి పాలకవర్గంతోపాటు ఫ్రెంచి రాడికలు, సోషలిస్టుపార్టీలు యింకా-యితర దుష్టశక్తులుగూడ దివాలా కోరుతనాన్ని ప్రదర్శించారు. కార్మిక వర్గానికి, ఫ్రెంచి ప్రజలకు తీరని ద్రోహం చేశారు. పాప్యులరు ఫ్రంటును భగ్నం గావించారు. దుష్టశక్తుల పాలసీని 'కుక్క-వెంటనేతోక' అన్నట్లుగా సమర్ధించి ప్రస్తుత యుద్ధానికి వీరుగూడ సమాన బాధ్యత వహించారు. సోవియట్ యూనియను యెడల ఫ్రెంచి ప్రభుత్వం న్యాయమైన మార్గం అవలంభించి యున్నట్లయితే శాంతిని కాపాడడానికే వుద్దేశించబడిన సోవియట్ ప్రస్తావనల ఫ్రెంచి ప్రభుత్వము అంగీకరించి యున్నట్లయితే ఫ్రాన్సు

యిలాంటి విషాదకరమయిన ఘట్టానికే వచ్చియుండేది గాదు. ఈ దివాళాకోరుతనం ఫ్రెంచి సేనానాయకులలోగూడ అంతగానే యుంది. ఫ్రెంచి సేనానాయకులకు యుద్ధాలపట్ల పూర్వ అభిప్రాయాలే వున్నాయి. ఆధునిక మిలిటరీ టెక్నికు సూత్రాలను వారు లక్ష్యం చేయలేదు. ఎనిమిదేండ్ల కాలంలో అధికభాగం యుద్ధమంత్రిగా వున్నటువంటి దలాదీరు అందుకు పూర్తి బాధ్యుడు.

"ఫ్రాన్సును నిజంగా కాపాడ దలంచుకున్నట్లయితే చిట్టచివర ఎనిమిది మాసములలో నయిన పూర్తిసన్నాహాలు చేసియుండ వచ్చును. కాని ఈ ఎనిమిది మాసాలలోనూగూడ యీ సామ్రాజ్యవాద పాలకులు తమ వర్గలాభాలే ప్రాధాన్యంగా దీసికొన్నారు. జర్మను సైన్యాలతో యుద్ధము చేయలేదుగాని స్వదేశంలోని పీడిత ప్రజలపై మాత్రం యుద్ధము చేశారు. తాము కమ్యూనిస్టులనో, లేక ఆపార్టీ సానుభూతిపరులనో సాకుతో మంచి తెలివి తేటలుగల, ప్రవీణులయిన కార్మికుల నందరినీ యుద్ధ పరికరాలను తృప్తిచేసే కార్మాగారాలనుండి తరిమివేశి యుద్ధప్రయత్నాలను నాశనం గావించారు. ప్రజలందరి స్వాతంత్రాన్ని, ఫ్రెంచిదేశం యొక్క స్వాతంత్ర్యాన్నే రక్షించడము తమవిధిగా ఎంచుకున్న ధీరులందరిపై తమ నిరంకుశ నిర్బంధవిధానం అమలుజరిపి ప్రభుత్వశాఖలోని గొప్ప గొప్ప వుద్యోగాలను జర్మనీ సామ్రాజ్యవాదంయొక్క ఏజంటైన కాగలార్డ్సుకు అప్పగించారు. ఫ్రెంచి జాతిలో చురుకుతనంగల్గిన, పురోగామి అయిన, ధైర్య సాహసాలతో పోరాడగల్గినటువంటి కమ్యూనిస్టులను అణచివేయడం, లేకుండా చేయడమే, తమ విధానంగా ఫ్రెంచి పాలకవర్గం ఎంచినందున ఫ్రెంచి ప్రజలయొక్క, ఫ్రెంచి సైన్యంయొక్క ధైర్యాన్ని నీతిని నాశనంచేశారు. ఫ్రాన్సు రక్షణలను కొంచపరచారు. తద్వారా మిలిటరీ అపజాయాలకుదారిదీశారు."

ఇలాంటి విషమదశనుండీ ఫ్రాన్సును కాపాడాలంటే మనం యీ క్రింది కోర్కెలతో పోరాడాలి. సాంఘిక, ఆర్థిక,

రాజకీయ విధానాలలోనూ, మిలిటరీ, యింకా నిర్మాణ(ఆర్గనైజేషను) విషయాలలోనూ మనం చాలా తీవ్రచర్యల నవలంబించాలి. దేశంలోని డబ్బును, అన్ని యితర సాధనాలను గూడ ప్రజల రక్షణకే వినియోగపడేలాగు చూడాలి. ప్రథమంగా, కమ్యూనిస్టులను వేటాడే విధానాన్ని అంతమొందింప జేసి మరలా పౌరసత్వహక్కులు లభించేవరకూ పోరాడాలి. బాధ్యతాయుత స్థానాలనుండి జర్మనీ ఏజంట్లయిన కాగులార్డులను వెంటనే తొలగించేట్లు చూడాలి. ఇంకా ద్రోహులను, వినాశకారులను, గూఢచారులందరినీ నిర్దాక్షిణ్యంగా నశింప జేయాలి.

తుదకు ఆ కరపత్రంలోనే ఫ్రెంచి ప్రజల నుద్దేశించి యీ క్రింది విధంగా వుంది—

"ఫ్రెంచి పాలకవర్గం, మనదేశాన్ని నాశనం చేయడానికి తయారుగావున్నది. ఫ్రాన్సుదేశాన్ని తన బానిసదేశంగా జేసికోవాలనే జర్మనీ ప్లాను నేడు అక్షరాల అమలులోనికి రానుండే, మనపాలకవర్గం వారి పెట్టుబడిని, వారి హక్కులను, వర్గాధికారాన్ని నిలబెట్టుకునేందుకే ప్రయత్నించుతూంది. మనదేశంయొక్క స్వాతంత్ర్యాన్ని, మనదేశ ప్రజలహక్కులను బలిచేయడానికి సిద్ధంగావుంది. జర్మనీతో చేయిగలిపి మనప్రజలను జర్మను తుపాకులచేగూడ కాల్పించ దలంచుకున్నారు. ఈ పాలకవర్గం, ఈ సోషలిస్టులూ, మనకు నిజమయిన విరోధులు. వారి పరిపాలన మనదేశాన్ని నిర్ణీతపద్ధతులద్వారా హత్య గావించుతూ వుంది. ఫ్రెంచి కమ్యూనిస్టులమయిన మేము పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా, వలసదేశ ప్రజలను దోచుకుంటూ బానిసత్వంలోవుంచే విధానానికి వ్యతిరేకంగా ఎల్లప్పుడూ పోరాడుతూనే వచ్చాము. ఇతర ప్రజలయెడల, ముఖ్యంగా జర్మనీ ప్రజలయెడల ఫ్రెంచి బూర్జువావర్గం అవలంబించిన సామ్రాజ్యవాద దోపిడీ విధానానికి మేమెల్లప్పుడూ వ్యతిరేకంగా పోరాడాము. అదే

విధంగా మన దేశప్రజలు విదేశ సామ్రాజ్యవాదానికి బానిసలుగా వుండ డానికి మనం వ్యతిరేకించాలి. మనపక్షానగల న్యాయము, హక్కులు, బలాలతో మన శత్రువుతో పోరాడాలి. తప్పక పోరాడుతాము. ఫ్రెంచి ప్రజలు, కార్మికులు విదేశబానిసలుగా ఎన్నటికీ వుండజాలరు.

లోగడ అన్నిపరిస్థితులలోవలెనే పరీక్షాసమయం, కష్టకాలము, చావుబ్రతుకుల సమయం, అయిన యిప్పుడుగూడ ఫ్రెంచి కమ్యూనిస్టుల మయిన మేము ఫ్రెంచి ప్రజలనే అంటిపెట్టుకొని యుంటాము. వారి క్షేమమే మా క్షేమం. ఫ్రెంచి ప్రజలయందు, వారి బలమందు, అసలు ఫ్రెంచి జాతియంటే మాకు సంపూర్ణ విశ్వాసముంది. మనప్రజలు నాశనం గారు. స్వేచ్ఛావాదులయిన మన ఫ్రెంచి ప్రజలను యీ దోపిడీగాండ్రు, అభివృద్ధి నిరోధకులు,యింకా దాడిచేసినవారు గూడ ఏమీ చేయజాలరు."

పై కరపత్రంలోని భావాలే ఫ్రెంచి ప్రజలలో అధిక భాగంయొక్క అభిప్రాయాలు. 1940 డిసెంబరు 20 తేదీని 'డైలీటెలిగ్రాఫ్' పత్రికలో యీాదిగువ ప్రకటన వెలువడింది.

"ఫ్రాన్సులో రాచకీయ చైతన్యం నీరుగారిపోయింది. రహస్యంగా నైనప్పటికీ యింకనూ నిలబడి పనిచేస్తున్నటిది ఒక్క కమ్యూనిస్టుపార్టీ మాత్రమే. గత ఒక్కమాసంలోనే వారిలో వెయ్యిమందికి మించి అరెస్టు చేయబడ్డారు. దేశాభిమానులయిన ప్రజలందరికీ వారు జర్మనీకి వ్యతిరేక చర్యలు, ప్లానులను గురించిన కరపత్రాలను పంచుతూనే యున్నారు."

హిట్లరుతో ఒడంబడిక గుదిరిన తర్వాత ఫ్రెంచిపాలక వర్గంయొక్క స్థితిగతులెలా యున్నాయో చూడవలసి యుం టుంది. ఇకవారు చేయదలచిందేమిటి? ఫ్రెంచి రిపబ్లికును నాశనం గావించి, ప్రజాస్వామ్య సూత్రాలు కించిత్తయినా లేనటువంటి నూతన రాజ్యాంగ విధానాన్ని ప్రవేశ పెట్టాలని ఎదురుచూస్తున్నారు. ఫాసిస్టు పరిపాలనను ఏర్పరచనున్నారు. దీనికి లావలు ప్రధానపాత్ర వహించాడు. జూన్ 23 తేదీని

లావలు వైస్‌ప్రిమియరుగా నియమించ బడినాడు. జూలై మొదటి తేదీని ఫ్రెంచి ప్రభుత్వం విషీకి మార్చబడింది. జూలై 9 న లావలు యికముందు ఫ్రాన్సు పాలనా విధానాన్ని గురించి బోధించాడు. ఆనాడే యీక్రింది తీర్మానము ఫ్రెంచి సెనేటులో 225-1 ఓట్లతోనూ, డెప్యూటీ ఛాంబరులో 395-3 ఓట్లతోనూ ఆమోదింపబడింది. ఈ సమావేశాలకు 2/3 వంతుకు తక్కువమంది సభ్యులే హాజరయ్యారు. ఆ తీర్మానము ప్రకారము ఫ్రాన్సులో నూతన రాజ్యాంగ విధానాన్ని ప్రవేశపెట్టుటకు మార్షలు పిటైనుకు సర్వాధికారం యీయడ మయింది. ఆ తీర్మానము జూలై 10 తేదీని జరిగిన జాతీయ శాసనసభా సమావేశంలో 569-80 ఓట్లతో ప్యాసయింది. దీనిని విశదీకరిస్తూ 'స్పీకర్' అయిన హీరియట్ యిక పార్లమెంటుకు యెలాంటి అధికారమూ వుండదనీ, ప్రభుత్వం పార్లమెంటుకు బాధ్యత వహించనవుసరం లేదని తెలియ జేశాడు. అదేరోజున ఫ్రాన్సును అమ్మివేసిన విధానానికి వ్యతిరేకంగా వ్రాసిన వార్తాహరులను అరెస్టు చేశారు. ఆ మరుసటిదినము తానుచేసిన రేడియో ప్రసంగంలో పిటైన్ అంతర్జాతీయ సోషలిజాన్ని, అంతర్జాతీయ కాపిటలిజాన్ని తీవ్రంగా ఖండించుతూ వుపన్యసించాడు.

జూలై 12 తేదీని పిటైన్ మూడు క్రొత్తచట్టాలను తయారుచేశాడు. వాటిప్రకారం మంత్రులను నియమించడం, తీసివేయడం, చట్టాలను తయారుచేయడం, వాటిని అమలులో పెట్టించడం, సివిలు, మిలిటరీ యింకా యితర అధికారాలను

వహించడంలో అతడే అధికారి. సైన్యమంతా అతని చెప్పు చేతలలోనే యుంటుంది. ఫ్రెంచి సెనేటును, ఛాంబరును రద్దుగావించి తనయిచ్ఛవచ్చినప్పుడు మాత్రమే వాటిని తిరిగి సమావేశపర్చవచ్చును. పైవిధంగా యింకా ఎన్నో డిక్రీలను అమలుజరిపించాడు. ఫ్రెంచి కార్మిక సంఘాలను, అఫీషియలు సంఘాలుగా, (అంటే పిటైన్ ప్రభుత్వంతో సహకారముచేసే సంఘాలుగా) మార్చివేశాడు. నాజీలను శత్రువులుగా భావించేవారికి వ్యతిరేకంగా అనేక చట్టాలు తయారు చేశాడు.

మొత్తంమీద ఫ్రెంచిరిపబ్లికును అమ్మివేయడమయింది. ప్రజాస్వామ్య సూత్రాలను హత్యచేశారు. కార్మిక సంఘాలను, ఫ్రెంచి మహావిప్లవంయొక్క పేరునుగూడ లేకుండా చేశారు. ఇలాంటి దుష్టశక్తులపై చరిత్రకోరచూపు చూస్తూనే యుంటుంది.



# 10. ఫ్రాన్స్ యొక్క భవిష్యత్తు

ఇక ఫ్రాన్స్ యొక్క, ఫ్రెంచి ప్రజలయొక్క భవిష్యత్తేమిటి? ఫ్రెంచిప్రజలయొక్క భవిష్యత్తు ఫ్రెంచి విదేశాంగ నీతిపైగాని, లేక యితరదేశాల ఒత్తిడిపైగాని ఆధారపడలేదు. చరిత్రముందుకు పోతూవున్నకొద్దీ దినదినానికి విజృంభించుతూవున్న ఆంతరంగిక శక్తుల ఘర్షణపైనే ఫ్రెంచి ప్రజల భవిష్యత్తు ఆధారపడియుంది. ఫ్రెంచిప్రజల భవిష్యత్తునుగూర్చి తెలిసికోవాలంటే మూడుప్రశ్నలకు సమాధానాలు తెలిసికోవలసియుంటుంది. మొదటిది ప్రస్తుతం ఫ్రాన్స్‌లోని పరిస్థితుల నిజానిజాలు ఎట్టివి? అంటే ఫ్రెంచి బూర్జువావర్గానికి కార్మిక వర్గానికి ఎలాంటి సంబంధముంది? ఈ వర్గాలయొక్క బలాబలాలు ఎలావున్నాయి? రెండవది హిట్లరు,ఫాసిజం యూరపు ఖండంలో ప్రవేశపెట్టినటువంటి ఆర్థికవ్యవస్థ యిలాగే కొనసాగితే ఫ్రాన్స్ యొక్క భవిష్యత్తు ఎలామారుతుంది? మూడవది అలాంటి ఆర్థికవ్యవస్థ ఎలా పరిణమించుతుంది?

ఫ్రెంచిపాలకవర్గం ఏవ్యక్తులకు వ్యతిరేకంగా ఫ్రాన్స్‌ను అమ్మివేసిందో గుర్తుంచుకొన్నప్పుడు ప్రస్తుత పరిస్థితియొక్క నిజానిజాలు సులభంగా బోధపడతాయి. చరిత్రయొక్క యీదశలో (యీ సామ్రాజ్యవాదవ్యవస్థలో) పాలకవర్గాలు వివిధ సామ్రాజ్యవాద దేశాలమధ్య జరిగేయుద్ధాలకన్నా తమ తమ దేశాలలో వివిధవర్గాలమధ్య జరిగే పోరాటంలోనే తమ

దృష్టిని కేంద్రీకరించుతాయి. వివిధసామ్రాజ్యవాద దేశాల మధ్య యుద్ధాలు జరుగుతున్న యీ కాలంలో ఫ్రెంచి పాలక వర్గానికివలెనే యేదేశపాలకవర్గమైనా తమ బూర్జువా అధికారాలను నిలబెట్టుకొనేందుకు జాతీయ (దేశీయ) హక్కులను బలిచేయడం ఒకటిరెండు శతాబ్దాల పూర్వంకంటే యిప్పుడు పరిపాటిఅయింది. ఫ్రెంచి కార్మికవర్గాన్ని పూర్తిగా అణచివేసి ఫ్రాన్స్‌లో తమవర్గాధికారాని నిలబెట్టుకునేందుకే హిట్లరు విధించిన షరతులకన్నింటికీ గత్యంతరంలేక ఫ్రెంచి పాలక వర్గం అంగీకరించింది.

పైకి ఎంత డాబు సరిగాకన్పించినా, యే ప్రభుత్వమైనప్పటికీ ప్రజాసామాన్యానికి గడగడలాడుతుంటుంది. ఎప్పటికప్పుడు తనబలాన్ని, ప్రజాసామాన్యంయొక్క బలాన్ని అంచనావేసికొనే తనదేశీయ, విదేశీయవిధానాలను [పాలసీలను] నిర్ణయించుకుంటుంది. ఏదోవిధంగా ప్రజాసామాన్యాన్ని తమ అధీనంలో వుంచుకోవాలని చూస్తుంది. ఈ పై విషయాన్ని ఋజువుచేయడానికి ఎన్నివుదాహరణలనయినా యీయవచ్చును. ఫ్రెంచి విషీప్రభుత్వమూ, జర్మనీ ప్రభుత్వమూ గలసి ఫ్రెంచి కార్మికవర్గాన్ని, ప్రజాసామాన్యాన్ని అణచియుంచడానికి సరిపోయే రాజ్యాంగప్రణాళిక, చట్టాలు తయారుచేయడమే మనకు నిదర్శనం. విషీ ప్రభుత్వంపై యింకా క్రూరమైన నిబంధనలను విధించి ఫ్రెంచి రక్తాన్ని పూర్తిగా పిండివేయడానికి హిట్లరు సాహసించక పోడానికి కారణం ఫ్రెంచి పాలకవర్గంమాత్రంకాదు. గాని తద్వారా ఫ్రెంచి ప్రజలను

రెచ్చగొట్టి తామథోగతి పాలుచెందవలసి వస్తుందనే భయం మాత్రమే. ఈ విషయాన్నే ఋజువుచేసిన యింకొక ఘటన గూర్చిగూడ వ్రాస్తాను. కవి, 'లాహ్యూమనైట్' అనే కమ్యూనిస్టు పత్రికాసంపాదకుడూ, కమ్యూనిస్టు నాయకుడు అయిన పాల్ వైలాన్ట్ కొచూరియర్ 1937 లో చనిపోయాడు. పారిసు కమ్యూనులో మరణించిన ధీరుల గోరీల ప్రక్కనే యితని గోరీకూడ కట్టబడింది. ఫ్రాన్స్ పతన మొందిన ఆరునెలల పిమ్మట ఆ కమ్యూనిస్టు నాయకుని జ్ఞాపకార్థం జరిగిన వార్షికోత్సవానికి పారిసులో పెద్ద కార్మిక ప్రదర్శనం జరిగింది. ఆ గోరీవద్దకు వరుసగా నాల్గుదినములు కార్మిక స్త్రీ పురుషులు తండోపతండాలుగా వెళ్లారు. అయిదు లక్షలకుమించిన ప్రజాసామాన్యం యీ ప్రదర్శనంలో పాల్గొన్నది. ఈ జనబాహుళ్యాన్ని, వారి క్రమశిక్షణా విధానాన్ని చూచి పోలీసులు వారిని ఆపుటకు ప్రయత్నించడానికైనా సాహసించలేకపోయారు. ఆ కమ్యూనిస్టు నాయకుని గోరీ మీద కొండవలె పూదండలుపడ్డాయి. ఈ విధంగా మరల ఒకసారి కార్మికవర్గము తమ ఐక్యతను, భవిష్యత్తును తమ నమ్మకాన్ని ప్రదర్శించింది. వీటన్నింటినిబట్టి ఏ పాలకవర్గమయినా కార్మికవర్గానికిభయపడి తమ పాలసీని నిర్ణయించుకుంటుందన్న విషయం మొదటిప్రశ్నకు సమాధానం.

ఇక యూరపులో ప్రస్తుతమున్న ఆర్థికవ్యవస్థ యిలానే కొనసాగేయెడల ఫ్రాన్సుభవిష్యత్తు ఎలావుంటుందనే రెండవ విషయానికి వద్దాం. ఈ సామ్రాజ్యవాదవ్యవస్థలో బీదతనం,

నిరుద్యోగం మొదలగునవి విజృంభించి పోయినాయి. ఇప్పుడు జరుగుతున్న యుద్ధఫలితంగా యీ సమస్యలు యుద్ధానంతరానికి వేయిరెట్లు యింకా హెచ్చుగుతాయి. యుద్ధానికిపూర్వమే, అంటే శాంతిదినాలలోనే యీ సమస్యలను పరిష్కరించలేని పెట్టుబడి దారీ ప్రభుత్వాలు యుద్ధఫలితంగా యింకా ఎన్నో రెట్లు విజృంభించు యీ సమస్యలను అసలే పరిష్కరించజాలవు. అందుచేత యుద్ధానంతరం మిలిటరీ జయాలవల్ల గెలుపొందిన యేప్రభుత్వాలయినా ఓడిపోయిన దేశాలను సర్వనాశనం చేస్తాయి. (యీ పుస్తకం జర్మనీ సోవియట్‌పై యుద్ధము ప్రకటించక పూర్వము వ్రాయబడిందని గుర్తుంచుకోవాలి.) తమ దేశాలలోనైనా కొంతవరకు యీ సమస్యలను పరిష్కరించుకోడానికి ఓడినదేశాలను బానిసదేశాలుగా తమకుకావలసిన ముడిపదార్థాలను సప్లయిచేసే దేశాలుగా మాత్రం అట్టిపెట్టుతాయి. ప్రస్తుతం జర్మనీ ఫ్రాన్సును పిండుచున్నట్లుగా ఓడినదేశాలను గెలుపొందినదేశాలు పిండివేస్తాయి.

ఈ పైవిషయాన్ని గ్రహించినప్పుడు అలాంటి ఆర్థిక వ్యవస్థ ఎలాపరిణమించేదీ, ఫ్రెంచిప్రజల భవిష్యత్తు ఎలావుండేదీగూడ తెలిసికోడం సులభమవుతుంది. కాబట్టి వోడిపోయిన దేశాలపై గెలుపొందినదేశాలు అలాంటి షరతులు విధించినప్పుడు కార్మికవర్గం, యితర ప్రజాసామాన్యం యింకా అధోగతిపాలవుతుంది. ఎలాంటిబిర్రు, సాహసముగల కార్మిక వర్గమైనప్పటికీ యీలాంటి నిర్బంధాలను, అవస్థలనూ ఎక్కువ కాలం భరించలేదు. యుద్ధానంతరమువరకూగూడ యే పెట్టు

బడిదారీ దేశము సోషలిస్టు ఆర్థికవిధానమును అవలంబించకపోయినట్లయితే, వేరేమాటలలో యుద్ధానంతరము వరకుగూడ యేదేశంలోనూ కార్మికవిప్లవం రాకుండా వున్నప్పుడు, యుద్ధము ముగిసిన తార్వాతయినప్పటికీ కార్మికవిప్లవాలు రాక తప్పదు. ఈ ఆర్థికక్షోభలనుండి, యీ నిరుద్యోగసమస్య, ఆకలిబాధలనుండి బయటపడాలంటే కార్మికవర్గం విప్లవం ద్వారాఅయినా సోషలిస్టు ఆర్థికవిధానాన్ని ఏర్పరచడానికి తప్పక ప్రయత్నించుతుంది. జయంపొందుతుందిగూడాను.

కాబట్టి ఫ్రెంచిప్రజల భవిష్యత్తు సోషలిస్టు ఆర్థికవ్యవస్థను ఏర్పరుచుటఅని ధైర్యంతో చెప్పవచ్చును. ఫ్రెంచి కార్మికవర్గం ప్రజాసామాన్యానికంతటికీ నాయకత్వం వహించి వారివిప్లవచైతన్యాన్ని, బలాన్ని సాహసాన్ని కొలదికాలంలోనే ప్రదర్శించుతుంది. అయితే ఫ్రెంచికార్మికవర్గం అలా ఎప్పుడుచేస్తుంది ? యూరపులోని యితరదేశాల ప్రజలు వీరిని అనుసరించుతారా ? లేదా ? అన్నదే ఆలోచించవలసిన ప్రశ్న. ప్రస్థుతం జర్మనీకి లొంగిపోయిన దేశాలలో ఫాసిస్టులకు ప్రజాసామాన్యానికి ప్రతిదినమూ జరుగుచున్న ఘర్షణలను చూస్తే త్వరలోనే నిరంకుశపాలనా విధానం అంతమొందించబడుతుందని నిష్కర్షగా చెప్పవచ్చు.

## ఫ్రాన్సునుండి గుణపాఠాలు.

ఫ్రాన్సులోజరిగిన యీ విషాద పరిస్థితులనుండి ముఖ్యంగా బ్రిటిషుప్రజలు, యితరదేశాల ప్రజలుగూడ అనేక పాఠాలను నేర్చుకోవలసియుంటుంది. మొదటిది బ్రిటిషు ప్రజలు

యిప్పటినుండీగూడ జాగ్రత్తతో, కట్టుదిట్టాలతో వుండాలి. ఎందుచేతనంటే ఏదోఒకదశలో బ్రిటిషు పాలకవర్గంలోగూడ ఒకభాగము, ఫ్రెంచి పాలకవర్గము ఫ్రెంచిప్రజల భవిష్యత్తును నిర్ణయించినట్లు, బ్రిటిషుప్రజల భవిష్యత్తునుగూడ నిర్ణయించ డానికి తయారుగావచ్చును. "బ్రిటనులో అలా జరుగనేరదు" అనేపదం సర్వసాధారణంగా బ్రిటనులో వాడబడుతూయుంది. 1940 మే నెల వరకూగూడ "ఫ్రాన్సులో అలా జరుగనేరదు" అనే ఫ్రెంచి ప్రజలు కలలుగన్నారన్న సంగతి బ్రిటిషు ప్రజలు మరువగూడదు. ఫ్రాన్సు పరిస్థితులు వేరు, బ్రిటను పరిస్థితులు వేరు. ఫ్రాన్సులో ఫాసిస్టుపాలన యేర్పడింది గాని బ్రిటనులో లవలేశమూ అలా జరుగుటకు అవకాశంలేదు–అని తలంచడం ఆత్మహత్య చేసికోవడంవంటిదే. రెండు దేశాలలోనూగూడ వర్గనిర్మాణం, ఎదుర్కొంటూన్న సమస్యలు ఒకేవిధంగా వున్నాయి. ఆ సమస్యలయొక్క తీక్ష్ణతలోమాత్రము కొంత తేడా యుండవచ్చును. ప్రపంచాన్నంతా ఆవరించినటువంటి గత 35 ఏండ్లలోని ఆర్థికక్షోభలు యీ రెండు దేశాలనుగూడ కొద్ది తేడాలతో దెబ్బకొట్టినాయి. ఇప్పటి పరిస్థితులనుబట్టి బ్రిటనుకంటె ఫ్రాన్సు ఎక్కువ జబ్బుస్థితిలోవున్నదని అనుకునే యెడల ఒకరోగి మరణించినప్పుడు రెండవరోగి బ్రతుకుతాడని వూహించడంకంటె వేరేప్రమాదం వుండబోదు. మనము యీ బ్రతికివున్నరోగికి సకాలంలో మంచిమందు వేయనిపక్షాన మొదటిరోగికంటె యీ రోగి ఎక్కువ బాధతో నెమ్మదిగా చచ్చిపోవచ్చును.

ముఖ్యంగా బ్రిటిషు ప్రభుత్వంగూడ దినదినానికి నిరం కుశవిధానాలను అవలంబించుతున్నదనే చెప్పాలి. కార్మిక సంఘాలను, యితరరాచకీయ పార్టీలను అణచివేస్తూవుంది. మ్యునిసిపాలిటీలను రద్దుగావించుతూంది. వారపత్రికలను నిషేధించుతూంది. పార్లమెంటులో వ్యతిరేకములు లేకుండా శుభ్రం జేయడానికి ప్రయత్నిస్తూవుంది. సెన్సారు షిప్పును ఎక్కువగా అమలుపరచి వాక్స్వాతంత్ర్యాన్ని గూడ అరికట్టివేస్తూవుంది. కాబట్టి యీ విషయా లన్నింటిలోనూ గూడ పురోభివృద్ధికరమైనవి గన్పించుట లేదు. శత్రువులకు వుపయోగపడే వార్తలను నిషేధించడం సమర్థించవచ్చును గాని ప్రభుత్వ మవలంబించే విధానాన్నయినా విమర్శించక పోనీయడం ప్రజాస్వామ్యసూత్రాలను మంటగలపడమే.

స్వేచ్ఛా విమర్శన, ఆధునిక రాజకీయ డెమాక్రసీకి అవసరం. అది ప్రభుత్వంలోని సామర్థ్యాన్ని పెంపొందించు తుంది. పార్లమెంటులో ప్రతికక్షులను రద్దుచేయడం అంటే అసమర్థతను అలావుంచమన్న మాట. అనేక లోపాలను నిలబెట్టడం అన్నమాట. సమయం వచ్చినప్పుడు యీ లోపాలు, యీ అసమర్థత, ఫ్రాన్సులోవలె ఫాసిజాన్ని గద్దె నెక్కించడానికి తయారుగా వుంచబడుతున్నా యన్నమాట. విమర్శ లేకపోతే మంచి సమర్థతతో ప్రభుత్వం పనిచేస్తుందను కోడం భ్రమ.

నిజంగా శత్రువులకు వుపయోగించే విషయాలు తప్ప తక్కిన అభిప్రాయాలను పూర్తిగా అణచివేయడం అసమర్థ

తను ఎక్కువ చేస్తుంది. లంచగొండితనాన్ని, విద్రోహాన్ని కప్పిపుచ్చి ప్రోత్సహించుతుంది. పాలకవర్గ మవలంబించే నిర్బంధ విధానాన్ని ఎదుర్కోడానికి కార్మికవర్గం నిర్మించుకున్న సంఘటన, ఆయుధాలను లాగివేయడం, పాలకవర్గానికి గొప్ప అధికారాలను యీయడం, జాతీయ ప్రయత్నాన్ని బలపర్చడం గాజాలదు.

"బ్రిటనులో అలా జరుగనేరదు" అనేవారంతా యీ క్రింది విషయాలు గమనించాలి. "ఫ్రెంచి పాలకవర్గం ప్రతి పక్షపత్రికలను అణచివేశారు. కొంతకాలం తర్వాత బ్రిటనూ ఆలాగే చేసింది. విచారణగాని, అప్పీలుగాని లేకుండా విదేశస్థులనేగాక దేశీయులనుగూడ ఫ్రాన్సులో ప్రభుత్వయిష్టానుసారం నిర్బంధించింది. బ్రిటనుగూడ 18 (సి) రెగ్యులేషను రీత్యా అలాగే చేసింది. ఫ్రెంచివాళ్లు సమ్మెహక్కును నిషేధించారు. పారిశ్రామిక సర్వసమీకరణం గావించారు. బ్రిటనూ అలాగే చేసింది. ధనికుల ధనాన్నిగాని, లాభాలు పొందడాన్నిగాని ముట్టకుండా బ్రిటను ఫ్రాన్సులో వలెనే వ్యవహరించింది.

### వామపక్షం చెప్పినదే ఋజువైంది.

దేశద్రోహులలసీ, అపాయకరమైన వ్యక్తులసీ, వామపక్షంమీద-ముఖ్యంగా కమ్యూనిస్టులమీద-దాడి తీసింది. పూర్వం రాడికలు, లిబరలు, లేబర్ పార్టీలమీద యిప్పుడు కమ్యూనిస్టులమీద నిందలు అంటగట్టబడు తున్నాయి. ఇది ముఖ్యంగా ఫాసిస్టులకు మంచిఆయుధం. దీనినిగురించి ఎవ్వరూ

